లగుచు యుక్తియుక్తంబులు ♦ నగుచు మదికి
నింపు గలుగంగఁ జేయుచు ♦ హితములగుచు. ౭ 1082

క. అలరెడు గభీరవాక్యం,బుల నతనిఁ బ్రసన్నుఁ జేసి ♦ భూరిస్నేహం
బలరారఁ బ్రేమదగ ని,మ్ములఁ దనవాక్యంబునందు ♦ ముదము గలుగుటన్.

క. మనమున నెఱింగి నిశ్చయ,మును జేసికొనుచును దత్త్వ♦మును బథ్యంబున్
గొనియాడఁదగినదియు నీ,తిని సామము నొక్కరీతిఁ ♦ దెల్పెడునదియున్. ౮

తే. ధర్మకలితంబు నర్థసం♦దర్భ మలరు
నదియు నగువాక్యమును బల్కి ♦ హరికులేశ్వ
రునికిడం జేరి తనపాండి♦తిని గనంగఁ
జేయుచున్ భాస్కరాత్మజ! ♦ క్షితిపకరుణ ౮½ 1085

క. ధరణీరాజ్యముఁ బడసితి, వురుయశమును గంటి వల్లె ♦ యుత్తమవంశా
చరణక్రమాగతమ్మగు, సిరినిం బొందితివి వృద్ధిఁ♦ జేసితి దానిన్. ౯ 1086

క. వనచరనాథా! యిఁక మి,త్రనివహమున్ గారవించి ♦ తత్కృత్యంబున్
మనసారఁ జేయఁగాఁ దగు,పనియే మిగిలినది దానిఁ ♦ బాటింపఁదగున్. ౯½

తే. ఎవఁడు మిత్రులఁ గూర్పంగ ♦ నెంచి యట్టి
కాలముల లక్షణంబులఁ ♦ గడు నెఱింగి
వారియెడఁ బరతంత్రుఁడై ♦ వఱలునో భువి
నతనిరాజ్యయశఃప్రతా♦పాదికములు. ౧౦½ 1088

క. నిరతము వృద్ధిం బొందును;, ధరణీశుని కెవని కెన్న ♦ ధనసైన్యములున్
వరమిత్రు లాత్మరాజ్యముఁ, బరస్పరము మైత్రి గలిగ ♦ వర్ధిల్లెడునో. ౧౧ 1089

క. అతఁడు మహారాజ్యమునకుఁ, బతియగు, నక్కారణమున ♦ భవ్యాచార
స్థితిఁ గాంచి చారువృత్తము, సతతము చెలువారుచున్న♦చతురుఁడ వౌటన్.

తే. ప్రతిన చేసిచెప్పునఁ ♦ బరమమిత్ర
కార్యమును సార్థకంబగు♦కరణిఁ జేయు
మెవఁడు తనకార్యజాలంబు♦నెల్ల వదలి
సంతతోత్సాహియై కడు♦సంభ్రమమున. ౧౩ 1091

తే. మిత్రకార్యంబులను పూన్కి ♦ మిగులఁ జేయు
చుండునో వానికాపద ♦ లొందవెపుడు;
సఖులకృత్యంబుల నెవండు ♦ సరిగఁ గాల
మునకుఁ దప్పక చేయఁడో ♦ మనుజుఁ డతఁడు. ౧౪ 1092

క. ఘనకార్యములను జేసియు, నొనరింపనివాఁడె యగును ♦ నొగి మిత్రులవౌ
పనులెల్లను నెఱవేఱవు, కనుకం జేసియు నసార్థ♦కంబె యగుఁ జుమీ!. ౧౪½

క. అరిసూదన! వీరా యి,త్తరుణంబున మనకు మిగులఁ ♦ దగినసఖుఁడు భూ

వరుఁడగు రాముఁడె కద? యా,దరమున నారాముపని ని♦తాంతము పూన్కిన్.

క. ఒనరింపవలయు; నది సీ,తను వెదకించుట యెగానఁ ♦ ద్వరపడి తీర్పం
జనుదాని, నోరిపుఘ్నా!, విను మిత్రుండైన రాఘు♦విభుకృత్యంబున్. ౧౫ 1095

తే. నిర్వహించుట కిప్పుడె ♦ నృపవరేణ్య
గడచెఁ గాలంబు; రాముండు ♦ కాలవేత్త
యయ్యుఁ ద్వరపడవలసిన ♦ ట్లమరియుండి
యును భవన్నిరీతిని ♦ యుండఁ గోరి. ౧౬ 1093

క. త్వరపడి పనిచేయుము, యి,త్తరుణమునం దనుచుఁ బలుకఁ♦దలఁపండు, హరీ
శ్వర! రాముఁడు సత్కులజుఁడు, సరసిజమిత్రాన్వవాయ♦సాగరశశియౌ. ౧౭

చ. మనకును ముఖ్యబంధు వన♦మానగుణాకరుఁ డప్రమేయపా
వనమహిమాఢ్యుఁడై తనరు♦వానరనాయక! నీవుకూడ మ
న్నన కనువైన సద్గుణగ♦ణంబులఁ గాంచినవాఁడవౌదు వా
తనిపని వేగ తీర్పుము? య♦తండును నీ కుపకర్తయౌఁ గదా!. ౧౮ 1098

చ. కనుకనె వానరోత్తముని♦కాయము జానకి తా నెఱింగి రా
ననుమతినిమ్ము రామవిభుఁ ♦ డల్లనఁ దెల్పకమున్నె కార్యముం
గని యొనరించినట్లయినఁ ♦ గాలము దాఁటిన తప్పుగల్గ దా
తనివచనంబు నూఁతఁగొని ♦ తద్గతిఁ జేసితిమే హరీశ్వరా!. ౧౯ 1099

క. కాలాతిక్రమదోషము, వాలాయము గల్గి తెఱు♦వనచరలక్ష్మీ
పాలక! యుపకర్తయె కాఁ, జాలనివానికిని నీవు ♦ సాయపడుదువూ!. ౨౦

చ ధనమును రాజ్యసంపద ము♦దంబున నీకు నొసంగినట్టి రా
మునిపని చేయుదీవనుచుఁ ♦ బొంకముగాఁ బలుకంగ నేల? యో
వనచర భల్లుకేశ! రఘు♦వర్యుని కార్యముఁ దీర్పు శక్తి నీ
కును గల దల్లి పౌరుష మ♦కుంఠముగాఁ దగునట్టి నీవిటన్. ౨౧ 1101

తే. దాశరథి ప్రీతికై భూమి♦తనయ వెదుక
వానరులఁ బంపఁగాఁ ♦ ద్వరపడకయున్న
వాఁడవేల? సురాసుర♦వ్యాళపతుల
శరములం జెండి రఘువంశ♦జలధిశశియు. ౨౨ 1102

చ. తనవశమందు నుంచుకొనఁ ♦ దాను సమర్థుఁడు గాదె యైననీ
వొనరిచినట్టి యా ప్రతిన ♦ యొప్పిదమై తనరార నీవె చే
*యను దగునంచుఁ గోరెడిని ♦ స్వామిగణంబును నైనఁ దాఁ ద్యజిం
పను దనుమాన మొందకయె ♦ వాలి వధించె భవత్ప్రియార్థమై. ౨౩ 1103

తే. అట్టి శ్రీరాముదేవి నీ♦యునని యుందు, నైన నాకాశమున నైన ♦ నరయుద మింక;

* ప్రాణత్యాగావిశంకేన-అనిమూలము.

నమరదైత్యగంధర్వులు ♦ యక్షవాయు, గణములతనికిభయమును♦ గల్గఁజేయ
తే. శక్తిగలవారు గాఁక ♦ సంతతంబు, నీచతం దగురక్కసుల్ ♦ నృపతి కతని
కెంతమాత్రము? చెప్పంగ♦నేల వారి, నట్లు గావున ఘనశక్తి ♦ కవనిపతికి. ౨౫

క. మును నీకుఁ బ్రియమొనర్చిన, ఘనునకు రామునకుఁ బ్రీతి♦గాఁ దత్కార్యం
బును సర్వవిధములం జే,యను జనుఁ; గపినాథ! యుష్మ♦దాజ్ఞ యెమైనన్.

*మ. ధరఁ బాతాళమునందు నీటఁ బయినం ♦ దర్వాత నాకాశమం
దరయంగా నిఁక నెందునైనఁ జనలే♦నట్లొప్పుచోట్లున్న వే
చరియింపంగలఁ డెవ్వఁడైనఁ గపియు♦న్మత్సైన్యనుం దోహరీ
శ్వర! పుణ్యాత్ములు నప్రధృష్యులును నో♦చంచత్కపీశుల్ తగన్. ౨౬౪ 1107

తే. కోట్యధికసంఖ్యగలరు నీ♦కున్ వశంగ
తులుగ నేపనిచేయంగ♦వలెనొ నీకు
నెట్టికార్యంబునం బూన ♦ నిపుడు తగునొ
యాజ్ఞ చేయుము; జరగుకా♦ర్యం బటన్న. ౨౭ 1108

చ. హనుమయుఁ గాలవేత్తయయి ♦ యాదరమొప్ప హితంబు నిట్లు చె
ప్పిన విని సత్వయుక్తుఁడయి ♦ పెంపెసలారఁగ నొప్పు సూర్యజుం
డనఘుఁడు మిత్రకార్యహిత♦మంతయుఁ దీర్పఁగనౌ నటంచు బు
ద్ధిని గొని యిష్టుఁడై తనకుఁ ♦ దృప్తిగఁ గార్యము చేయువానరున్. ౨౮౪

తే. నలునిఁగని యెల్లదిక్కుల ♦ నిలిచియున్న
సైన్యమును వేగ రావించి ♦ చక్కఁగూర్పఁ
వలయునని యాజ్ఞ చేయంగఁ ♦ దలఁచి పలికె
సైన్యనాయక! వనచర♦సముదయములు. 30 1110

సీ. యూథపాలకులయి ♦ యొప్పువానరులును సైన్యయుక్తంబుగ ♦ నరగ నిటకు
వచ్చి చేరెడునట్లు ♦ వారకచేయుమా, యత్నంబునం బూని ♦ యలరి శీఘ్ర
గమనంబు చెలువారఁ♦గా నొప్పు సైన్యపర్యంతపాలకులగు♦నట్టి కపులు
తమతమసేనలఁ ♦ ద్వరితంబుగాఁ గొనివత్తురు గాక యా♦యత్తమడర

తే. నస్మదీయాజ్ఞ నీచెంత ♦ నమరియున్న
సైన్యమును నీవె కనుఁగొని ♦ సపరికరము
గాఁగ రావింపు నేఁడాది♦గాఁగఁ బంచ
దశనిశల కవ్వల నెవంను ♦ తరలి యిటకు. 33 1111

తే. వచ్చి చేరకయుండునో ♦ వాని కంత
కరమయిన దండమేచేయుఁ ♦ గాఁ బడుఁ జుమి!
సందియమె లేదు దీనికి ♦ స్వామియాజ్ఞఁ
బూని నీ వంగదునితోడఁ ♦ బోయి వేగ. 33౪ 1112

* గతి రోప్నపరిచాంబరే-అనిమూ.

చ. వనచరపంక్తిఁ జేరఁ జని ♦ భల్లుకవర్యుఁడు జాంబవంతుఁ డు
న్న నెలవుఁ జేరి శాసనము ♦ నాయది వారికిఁ జెప్పిరమ్ము వే
యని హరిపుంగవుండు తగి♦నట్లు వ్యవస్థను జేసి యంతఁ బో
యెను దనసౌధసీమకు న♦భీష్టసుఖంబులఁ బొందుకోరికన్. ౩౯ 1113

ఇరువదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౩౦ - వ సర్గము.

శరదృతుసమాగమము - రాముఁడు సుగ్రీవునిపై నాగ్రహించుట.

క. వనచరనాథుఁడు కిష్కింధను జేరఁగ నంత నిచట ♦ దాశరథియు వృ
ష్టిని గలకాలంబెల్ల ను,దనవేదనచేతఁ గుంది ♦ తత్తఱపడుచున్. ౧ 1114

ఆ. ఎట్లొ గడిపి యంత ♦ నెల్ల మేఘంబులు, చనఁగ విమలమయి గ♦గనతలంబు
పాండురమయి వెలయ ♦ భవ్యమై విమలమై,యిందుమండలంబు♦ నెసఁగుచుండ.

సీ. చంద్రికాలేపనా♦చ్ఛంబయి శారదరాత్రియుఁ గన నభి♦రామమగుచుఁ
దనరఁగాఁ గామవృ♦త్తంబున సుగ్రీవుఁ డఖిలసుఖంబుల ♦ ననుభవించు
చుంటయు;జనకజ♦యురుశోకముల‌ఁగుందుచును జెంత లేకుంట♦యునునియమిత
కాలంబు మెల్లన ♦ గడచుటయును నాత్మఁ దలపోసి యపు డనం♦తమగుశోక

ఆ. మొంది మూర్ఛనొందె ♦ నొకముహూర్తమునకు
మరలఁ దెలివినొంది ♦ మతివిభవము
గలరఘూత్తముండు ♦ కాంత మనస్సున
నున్నదామె గుఱిచి ♦ యొక్కరీతి. ౪ 1116

క. తలపోయనాగె; నారఘు,కులదీపకుఁ డచట శిఖరి♦కూటంబున సి
స్తుల హేమధాతుమయమునఁ, గలఁగినమదిఁ గూరుచుండి ♦ గగనతలంబున్.

క. శారదమున స్వచ్ఛంబయి, చారుతరం బగుచు వెలయ ♦ స్వాంతమునందున్
గోరికఁ బ్రేయసిఁ దలఁచెను, ధారాధరములు తటిద్వి♦తానము లేమిన్. ౫

*క. సురమార్గము నిర్మలమై, వరసారసవిహగనినద♦వరఘుష్టంబై
పరఁగ న్విలపించెను రఘు,వరుఁ డార్తుండగుచు నార్త♦వాక్యంబులతోన్. ౬

చ. మునుపిట నాశ్రమంబునఁ బ్ర♦మోదము పొంగఁగ సారసారవం
బనఁదగు కంఠనాదమున ♦ నాజనకప్రియపుత్రి యుండి యిం
పును గలిగించుబెగ్గురుల ♦ పొల్పగునాదములన్ రమించుచుం
డును గద యిప్పు డైత్యులు క♦డున్ భయపెట్టఁగ నెట్టులున్నదో. ౭ 1120

సీ. బంగారుపూవుల♦భంగి రంగారుచుఁ బూచిన వేగిస♦పూలఁ గాంచి
యాబాలికామణి ♦ యాసక్తి నను‌ఁగాంచి కనఁబడకున్న నొ♦క్కరణి మోద

* విలలాపార్తయాగిరా. అనిమూ.

మును బొందఁజాలు;? నా♦యనవద్యసర్వాంగి కలభాషిణి ధరిత్రి♦కన్య సీత
కలహంసమృదురవ♦ములకు మేల్కొనుగద యిపుడెట్లు మేల్కొను?♦నెల్లవేళ
తే. లందు సహచరములగు నె♦య్యంపుఁజక్ర
వాకములపల్కులన్ విని ♦ వనిత నన్నుఁ
గానఁగాఁ గోరి పుండరీ♦కవిపులాక్షి
నాదురాకను జూచునే ♦ యాదరమున. ౯౪ 1121

క. ఇపుడెట్లు ప్రాణములఁ దన, వపువున ధరియించి దనుజ♦వసతిని నుండున్?
విపినమున నిందు భూమిజ, యిపు డామృగశాబనయన♦యింపు గులుకఁగన్.

క. పరిసరమున లేకుండుట, సరసుల బావులను వనుల ♦ శైవలినులఁ గ్రు
మ్మరుచున్ననాకు సౌఖ్యము, పరికించిననైనఁ గానఁ♦బడదు కటకటా!. ౧౧

క. స్మరుఁడెంతయును శరద్ఘృణ, నిరంతరుఁడు నన్నుఁబాసి ♦ నెలఁత యలరునం
చురుసౌకుమార్యమున నొ,ప్పురనుఃశి యనుచుం దలంచి ♦ పొంగెడుకాంతున్.

క. వనితామణి ప్రాణాత్యయ,ము నొందువఱ కార్తిజలధి ♦ మునుఁగన్ బాధిం
చునొ యేమొ? విడువఁ డతఁడ,ప్పని చేయక; నిర్దయుండు♦ప్రద్యుమ్నుఁడునూ!

చ. అనియిటు రామచంద్రుఁ డను♦రాధిపుఁగూఱిచి చాతకంబు నీ
టిని గొనఁగోరి యేడ్చుగతి ♦ దీవిని బాసి మహీకుమారి సీ
తను దలపోసి యేడ్చె; సత♦తంబును లక్ష్మి చెలంగనున్నయా
తనియనుజుండు లక్ష్మణుఁడు ♦ తద్గిరిసానువులన్ ఫలార్థియై. ౧౩౪ 1126

తే. కుటిలమార్గంబులన్ బండ్లు ♦ కోయఁ దిరిగి
రమ్యసానుతటంబుల ♦ రయముమీఱ
ఫలములం గోసికొనివచ్చి ♦ భవ్యమూర్తి
నన్నయగురామునిం గాంచె ♦ నద్రిపయిని. ౧౮ 1127

క. కరుణాంతరంగుఁడగు రఘు, వరసహజుం డట్లు పగల ♦ భరియింపఁగలే
క రమణిఁ దలఁచుచు నిర్జన, ధరభాగమ్మున నొకండె ♦ దారుణపీడన్. ౧౮౪

క. పరిపీడితుఁడగుచుఁ గళే, బరముపయిన్ స్మృతియె లేక ♦ పగఁగుందెడు శ్రీ
పరుఁ గాంచి తానునెంతయుఁ, బరితాపమునొంది దైన్య♦పరతంత్రుండై. ౧౯

సీ. పలికె నిట్లని; యార్య♦పరమధార్మిక! విను మేకాలమున మన♦స్సెంతొ దిటవు
గా నుండఁదగునొ యా♦కాలమందే కామవశమునఁ జిక్కినఁ ♦ బౌరుషంబు
వదలిన నుత్సాహ♦పరతమానిన నేమిఫలము? కార్యము చేయు♦పట్టుదలను
బూనుట స్థిరమగు♦బుద్ధిని గొనుటయుఁ గాలానుసారియై ♦ క్రాలుధైర్య
తే. మును నుపాయము నొందుట ♦ మనకు సాయ
పడెడుసుగ్రీవముఖులను ♦ బటుబలాఢ్య

లను గ్రహించుట దేవత♦లను బ్రియమున
వేఁడుటయు నివ్వి సాధన♦వితతిగాఁగ. ౧౬ 1130

క. మనమున గ్రహించి కార్యం,బును నీడేరుచుకొనుము వి♦భూ! ఘనసత్త్వ!
మనుజేంద్ర! త్వత్సనాథను, జనకజ దక్కించుకొనఁగఁ♦జాలఁ డొరుఁడు సూ!.

క. కరమున నగ్నిజ్వాలల, వరవీరా! పట్టుకొని యె♦వండయిన న్ని
ర్భరవహ్నిశిఖలఁ గాలక, ధరణి న్నిలువంగఁగలఁడె ♦ దర్పసమగ్రా. ౧౭ 1132

చ. అనియిటు లప్రధృష్యుఁడయి ♦ యారయఁగా హితమై స్వభావజం
బునునయి ప్రస్తుతస్థితికి ♦ భూరిసుఖాకరమై మహీశ నీ
తిని దగఁగూడి సాంత్వనము ♦ దృప్తిని నిచ్చుచు ధర్మయుక్తమై
తనరుచు నర్థవంతమయి ♦ తద్దయు నొప్పెడువాక్య మెన్ని చె
ప్పిన శుభలక్షణుల్ సహజుఁ ♦ బ్రీతినిఁ గాంచి మహీశుఁ డిట్లనున్. ౧౮ 1133

చ. అనఘ! కుమార! నీఁనిన♦దంతయు నిశ్చయమౌను గార్యమున్
మనమున నెంచి దానికి న♦మానుషధైర్యము నొంది సంశయం
బును గనకుండఁ జూచుకొనఁ♦బోలును గొప్పగ సాహసంబునుం
గొనఁదగు నియ్యెడన్ మనము ♦ గోరినదుర్ఘటకార్యమారయన్. ౧౯ 1134

క. జనకసుతాప్రాప్తిని గనఁ, గను జేసి ఫలించునా త♦గంగా నని నె
మ్మనమున నెన్నఁగఁ దగిదదె, యని యప్పుడు ఫుల్లపంక♦జాక్షిని సీతన్. ౨౦

*క. తలపోసి వగల నోరెం,డ లక్ష్మణుం గాంచి పలికె; ♦ నముచిరిపుం డి
మ్ముల భూమికిఁ గావలసిన, యలఘుతరసువృష్టిఁ గురిసి ♦ యలరిచి తృప్తిన్.

తే. సస్యములఁ బండఁజేసి వే ♦ స్వహితకృత్య
మిట్టు లొనరిచి తాఁ గృత♦కృత్యుఁడయ్యె;
స్నిగ్ధగంభీరఘోషంబు ♦ చెలఁగ శిఖరి
తరువులపయిని బోవుచుఁ ♦ జత్వరతను. ౨౨॥ 1137

సీ. జలములవర్షించి ♦ శ్రమము నొందినయట్టు లున్నవి; మఱియు నీ♦లోత్పలముల
పత్రములంబోలి ♦ పరఁగుమేఘంబులు శ్యామీకృతదశది♦శలయి తనరి
శాంతవేగములయి ♦ సాంద్రమదంబును వీడిన నాగేంద్ర♦బృందమట్టు
లున్నవి; సౌమ్య! య♦త్యుచ్ఛ్రియవృష్టికృద్వాతము ల్సలిలగ♦ర్భంబు లగుచు

తే. నర్జునకుటజసాధువు♦ష్పాళిపరిమ
ళముల నింపయి యధిక వే♦గమున వీచి
యిపుడు నిలిచిన; వి త్తతి ♦ నేనుఁగులయు
జలదశిఖినిర్ఝరములయు ♦ స్వనము లుడిగె. ౨౩ 1138

* ముఖేన పరిశుష్యతా-అనిమూలము.

చ. ధరములు మేఘదత్తజల♦ధారలనిర్మలరీతి నొప్పి నుం
దరబహువర్ణసానువులు ♦ తద్దయుఁ బొల్పెసలారఁగా మనో
హరతిరచిత్రదీప్తులను ♦ నారయఁగా వరకుంకుమాదిన
త్పరిమళయుక్తిఁ గన్నగతి ♦ భాసిలుచున్నవి; చూడు! లక్ష్మణా!. ౨౭ 1139

[1] తే. నవ్యసంగమమునయందు ♦ నాతులెల్ల
లజ్జపెంపున మెల్లమె♦ల్లఁగ జఘనము
లను వెలికిఁ బుచ్చునట్లుగ ♦ [2]ధునులు పులిన
ముల శరత్కాలమునను బ♦యలుపఱచెడు. ౨౮ 1140

చ. శరదయు స్వీయమై పరఁగు♦సంపద సప్తపత్త్రశాఖలన్
అగుణశశాంకతారకల ♦ యచ్ఛమరీచులయందు మత్తకుం
జరసువిలాసమందు నిటు♦చాల విభాగముచేసి వ్యాప్తిచేఁ
బరఁగుచునున్న దెంతయును ♦ భవ్యతనుంబుగ నేత్రపర్వమై. ౨౯ 1141

సీ. అరుణుని ప్రథమి♦కాయతకాంతులఁ జక్కఁగాఁ బూచిన♦సరసులందు
బహువర్ణరమణీయ♦పంకజాశ్రయమునఁ జిత్రకాంతులచేతఁ ♦ జెలఁగి యీ శ
రద్గుణమునఁ గల్గి ♦ రంజిల్లులక్ష్మియు నలరారుచున్నది ♦ యధికమగుచు;
నేడాకులరఁటుల ♦ నెసఁగుఁబుష్పంబుల పరిమళమును బొంది ♦ భ్రమరపంక్తి
తే. యలరి పాడుచు వెంటరా ♦ నడవులందుఁ
బవనుఁ డెంతయుఁ బ్రసరించు♦వాఁడు గాన
మదగజంబులకెల్లను ♦ మఱిగను దర్ప
వృద్ధినిం జేయుచున్నాఁడు ♦ నిచ్ఛతనర. ౩౦ 1142

చ. సురుచిరపక్షము ల్మిగుల ♦ శోభిలఁగా మిథునంబులాట నొం
దొరులకు నాభిముఖ్యముగ ♦ నొప్పుచుఁ బంకజరేణువుల్కళే
బరములనిండ హంసమ♦వాయము జక్కవలున్ సరఃప్రియం
బరుదుగఁ గల్గియున్నయవి ♦ యాట మహానదులందు హాయిగాఁ
బరఁగెడుసైకతస్థలుల ♦ బాగుగఁ గేళియొనర్చెడుం జుమీ!. ౩౨ 1143

చ. సరసిజవాన మత్తకరి♦సంతతియందు మదించియున్న గో
వరములయందు స్వచ్ఛతర♦వారిఁ జెలంగెడు సత్సరిద్వంతికో
త్కరమున నీశర త్తలరు♦కాలమున న్మిగుల న్విభక్తమై
నిరుపమకాంతిమై వెలసె ♦ నెమ్మి చెలంగఁగ నో ప్రియానుజా! ౩౩ 1144

చ. ఘనములఁ బాసి శుభ్రముగఁ ♦ గన్పడువ్యోమముఁ గాంచి కాననం
బున నెమిళుల్ స్వబర్హములఁ ♦ బొంకముగాఁ దగుభూషణంబులన్
గొనకొని విప్పమాని తమ♦కోమలులం దనురక్తిమాని కాం

1 నవ్యసంగమసవ్రీడా జఘనానీవ యోషితామ్-అనిమూలము. 2 ధునులు=నదులు

తిని విడనాడి యుత్సవగ♦తిం దగఁ బాయుచు ధ్యానమందుఁ బెం
పును గనుచున్నవానివలెఁ ♦ బొల్చెడుఁహర్షము దూలి యెంతయున్. ౩౮

సీసమాలిక:—

మంజులవాసన ♦ ల్మలయంగ గొప్పవై పుష్పగుచ్ఛంబుల ♦ భూరిభార
మునను శాఖాగ్రము ♦ ల్గొనకొని వంగఁగ బంగరుచాయయు ♦ రంగుమీఱఁ
గన్నులపండువు♦గానున్న వేగిసవృక్షము ల్వనసీమ ♦ వెలయుచుంట
దీపమ్ము లుంచిన♦తెఱఁగున నున్న; విప్పుడు ద్విపేంద్రమ్ములు ♦ పొడలుచున్న
యేడాకులరఁటుల ♦ నెనఁగుఁబూవులవాసనలకు మదంబులు ♦ చెలఁగి కటత
టముల భేదింప న♦ట్టిమదమున న్వివశయాసక్తి పొసఁగఁ బ్రి♦యాన్వితమ్ము
లయి సరోవరముల♦యందు వనంబులయందును విహరింప ♦ నరుగుచుండి
గతులు మందంబులు♦గాఁగఁ బోవుచునున్న; వాకాశము నిరభ్ర♦మైతనరుచుఁ
జక్కఁగాఁ దుడిచిన ♦ శస్త్రవర్ణంబును గాంచుచున్నది, నిమ్న♦గాజలప్ర
వాహ మడఁగినది ♦ వాయువు గ్కహ్లారశీతలమ్ము లగుచుఁ ♦ జెలఁగి వీచు
చున్నవి, దిక్కులు ♦ సోదరా! తమములు విచ్చి పోవుటఁ జాల ♦ విమలములయి
కనఁబడుచున్నవి; ♦ స్థలమంతయు రవిరశ్మిసోఁక బు♦రద లడంగ
స్థూలరేణువులుగాఁ♦దోఁచుదుమ్మును గొంతగల్గియున్నది, మహీ♦కాంతులకును
నితరేతరము చాల ♦ నెక్కువపగయు నసూయయుఁ గలవారి♦కీయదనున
దండయాత్రలు సల్పఁ♦దగు, దాని కీకాల మనుకూలమై యున్న♦దరయనిపుడు
కొమరారుసీకర♦ద్గుణవర్ధితాంగసౌష్ఠవకాంతులొప్ప వృ♦షభములెల్ల
బలిసియుఁ బొంనుసం♦కలితాంగములుదగుమదముననొండొంటి♦మార్కొనంగ
బూని యావులమధ్య♦మున కేగి యార్చుచు నున్నవి,వనములం♦దొగిఁగరిణులు
కామంబు గొని తమ♦కదుపులతోఁగూడి యనురాగభరమున ♦ నతిశయించి
మదమెంతో యధికమై♦పొదలంగ మందగమనమునఁజనుచున్న♦పెనిమిటులను
వెంబడించియె ప్రీతి♦విలసిల్లఁ జనుచున్న; వరయ మయూరంబు♦లాయతాభ
రణములైనట్టి బ♦ర్హములెల్లఁ దూలంగ నేరుల దరులకు ♦ నేగ నచట
నలరుచున్నట్టి యా♦హంసలు దమ్మును బెదరించునట్లుగ ♦ వింతగులుకఁ
గూయంగ మనమును♦గోల్పోయి దీనములై పోవుచున్న; వి♦య్యదనునందు;
మదభిన్నకటములై ♦ మలయుగజేంద్రముల్ ఘనరవంబులు మీఱఁ♦గానరన్ను
లను జొచ్చి జక్కవ♦లను గన్నెలెల్లను భయపెట్టుచున్ ఫుల్ల♦పంకజాత
ముల భూషితములగు♦కొలఁకుల క్షోభిల్లఁ జేయుచు జలములఁ ♦ జిమ్మిచిమ్మి
త్రాగుచున్నవి విక♦ర్దమములై సైకతస్థలులు చెన్నార ని♦ర్మలజలములు
విలసిల్ల నాలమం♦దలు పొల్పుమీఱఁగా గంభీరజలనాద♦కలితములయి
యొప్పారునదులందు♦నొగినంచలును సారసపతత్రులును సంత♦సమునఁ జొచ్చు

చున్నవి; నదుల యం♦త్యుద్ధతజలపూరరవములు సెలయేళ్ల♦రవములల్లి
ఘనతరానిలభూరి♦నినదము ల్నెమిళుల కేకారవంబులు ♦ ప్రకటంబు
లగుకప్పకూతలు ♦ నడఁగిన వియ్యెడ; వానకాలముఁరాఁగ ♦ వారిధరము
లార్భటింపంగ బ♦యళ్లఁ దిరుగలేక యెందొావసించుచు ♦ నెంతోచిక్కి
తనువులు కృశియింప ♦ దమపెంపు నశియింప నాఁకలిబాధయు ♦ నతిశయింప
ఘోరవిషంబులు ♦ భూరినాదంబులు బహువర్ణములు గల♦పాములెల్ల
బిలముల వెలువడి ♦ మెలమెల్లనట సంచరించుచున్నవి గూఢు ♦ మంచితముగ;
నతిశయంబుగ వెల్లు♦నబ్జకరంబులు ప్రసరించి తారకా♦పటలమెల్లఁ
గనఁబడ సాంధ్యరా♦గము తానె యౌరౌర! యాకసంబుగ నుండి♦యట్టె తీసి
పోవుచున్నది; నిశా♦భూపాలమృదువక్త్రమై, తారకానమూ♦హములె వికసి
తాక్షులు వెలయంగ♦నమలమౌ జ్యోత్స్నాంశుక ప్రావరణము ద♦గంగ రాత్రి
శశివదనంబును ♦ జక్కనికన్నులు శ్వేతాంబరము గప్పి ♦ చెలఁగుఁ జెలువ
వలె నొప్పుచున్నది ♦ చెలువంపు బెగ్గురుపక్షులు చక్కఁగాఁ ♦ బండినట్టి
వరిగింజలను మెక్కి♦నిరుపమోత్సాహంబు గనుచు బారులుగట్టి♦ఘనజవమున
గ్రథితమాలిక యట్లు ♦ గాలికి నెగురునో యట్టులాకాశము♦నందు నెగురు
చున్నవి; లోఁతుగా ♦ నొప్పుప్రాఁకంబునఁ దెల్లనియొకయంచ ♦ యుల్లసిల్లి
నిదురింపుచుండఁ గు♦ముదములు వెలయంగ నందలి తెలినీర ♦ మంబుదములు
కనఁబడకుండంగఁ ♦ గడురమ్యమై పూర్ణశశిఁగూడి తారకా♦సముదయములఁ
గ్రాలెడురాత్రి నా♦కాశంబువలె నొప్పుచున్నది; గుంపుగ ♦ నొప్పుహంస
కాండమే మొలనూలు♦గా వికసించినయంబుజోత్పలములె ♦ యనులపువ్వు
హారంబులుగ నొప్పు♦నట్టిబావులు భ్రమరాళిచేఁ బూలచే ♦ నలరు నుత్త
మాంగనలవలెఁ జె♦న్నలరుచున్నవి; ప్రొద్దున నె గోపికలు పెరు♦గునుజిలుకఁగఁ
గలుగు చప్పుళ్లు, నా♦వులు దూడలకుగాను ధ్వనిచేయునంబార♦వములు,వృషభ
ఘననాదములు, వేణు♦నినదమ్ములనుగూడి ప్రాతస్సమయమున ♦ వఱలు వాయు
వున నెక్కువయి యంత♦టను దగ వ్యాపించియుండొంటితోఁ జేరి♦యొక్క రీతి
వృద్ధినొందుచునున్న ♦ వీయెడ; నిమ్నగాతటములు మృదుమారు♦తముననలరు
చును గ్రొత్తపూలచే♦తను విలసిల్లుచు ధౌతకౌశేయవ♦స్త్రములరీతి
నలరు తెల్లుపొదల ♦ నావృతములయి తెల్లనిపట్టుపుట్టంబు ♦ తనరనున్న
వనితల జంఘల♦వలె నొప్పుచున్నవి; వనులనడ్డము లేక ♦ పరుగులిడుచు
మధుపానమును జేసి ♦ మత్తిల్లి ధూర్తంబులై ప్రియలంగూడి♦యబ్జములయు
బంధూకమృదులపు♦ష్పములయుఁ బుప్పొళ్లఁ బొరలాడిపచ్చఁగాఁ♦బొలుచువన్నె
గలుగఁ దుమ్మెదలొగి ♦ గాలివాసనలకై దానివెంట దగిలియె ♦ తారు పోవు
చున్నవి; శుభ్రమా♦నుదకముల్ వికసితకుముదముల్ క్రౌంచస్వ♦నములుపక్వ
శాలిసస్యమ్ములు ♦ లీలఁ గ్రాలెడుగాలి యతివిమలంబగు♦నబ్జబింబ

తే. మిన్నియెల్లను వర్షర్తు ♦ వేగి యిపుడు
వచ్చెఁ జుమ్ము శరత్తని ♦ పలుకుచున్న
యట్లు తెల్పెడు; మఱియు నీ♦యదన మీన
వితతియే మొలనూళ్లగా ♦ వెలయునదులు. ౫౪ 1146

క. అనురక్తి నిశలఁ గాంతుల, ఘనకేళులఁ దేలి యుదయ♦కాలంబున మె
ల్లనిగతులఁ బోవుసుందర, వనితలగతి మందగతులఁ ♦ బాఱెడుఁ గంటే ౫౫

చ. కనుమవె చక్రవాకముల♦కాండము లొప్పఁగఁ బాఁచి గల్గి చ
క్కనిదగు తెల్లుగప్పుకొనఁ♦గా నలరారు నదీముఖంబు లొ
య్యనఁదగు రోచనంబు చెలు♦వారఁగఁ బత్రవిలాసయుక్తిమైఁ
దనరి దుకూలసంవృతని ♦ దద్దయు రాజిలు స్త్రీలమోమునాఁ
గనదురుకాంతిచే వెలయు ♦ గాదిలితమ్ముఁడ! సద్గుణాకరా! ౫౬ 1148

తే. నల్లగోరంటపూవుల ♦ నుల్ల సిలరఁ, జేయు వేగిసపూవులఁ ♦ జిత్రితమ్ము
లగుచుఁ గ్రొవ్వినషట్పద♦హారిఝంకృ,తులను వెలసెడుపనభాగ♦ములస్మరుండు.

చ. శరములఁ జాపముం గొనుచు ♦ సాధ్వసరీతిగ మాఱులేకయే
తిరుగుచునున్నవాఁడు, సుమ♦తిన్ జలదంబులు మంచివృష్టిచే
ధరఁగల మానవప్రతతిఁ ♦ దద్దయు సంతసిలంగఁ జేయుచున్
సరసులనుం దటాకముల ♦ శైవలినీనికరంబునిండ స
త్వరముగఁ జేసి సస్యములఁ ♦ బండఁగఁ జేసి నభంబు వీడెఁ జూ!. ౫౮ 1150

క. సలిలాశయములు నిర్మల,ములగు జలంబులను వెలసి ♦ ముదమునఁ గ్రౌంచం
బుల కూజితములచేతం, జెలఁగుచు జక్కవలపిండు♦చేతం దనరున్. ౫౯ 1151

తే. సప్తపర్ణంబులును, వేగి♦సములు దేవ
కాంచనంబులు మఱియుఁ బ్రేం♦కణపుఁజెట్లు
మంకెనలు సానువులయందు ♦ మంచిపూలఁ
గానఁబడుచున్నయవి సౌమ్య! ♦ కంటె వాని. ౬౦ 1152

క. కనుమా! లక్ష్మణ! పులినా,వనులన్ జక్కవలు హంస♦పక్షులు మఱి క్రౌం
చనికాయము సారసములు, దనివారెడు కేళినుండుఁ ♦ దమకదుపులతోన్ ౬౧

క. నరపతిపుత్రా! సౌమ్యా!, పరస్పరజిగీషువులయి ♦ పైపై వైరం
బరయుచునుండు నృపాలో,త్కరమనికై యుద్యమించు ♦ తఱుణము వచ్చెన్.

చ. అని నొనరింపఁగాఁ దొలిప్ర♦యాణము రాజులుచేయుకాల మొ
య్యనఁ జనుదెంచె నిప్పుడు నృ♦పాత్మజ! సూర్యతనూజుఁడన్ననో
కనఁబడఁ డట్టియత్నమును ♦ గాని యొనర్చిన జాడలేదు; సీ
తను గన కార్తిఁ గుందుచు ని♦తాంతము నేఁడ్చెదనాకుఁ జూడఁగన్. ౬౩౪

తే. వానకాలంపుమాసముల్ ♦ పరగుణాఢ్య
నాల్గునూఱేండ్లుగా సాగి♦నయవి; జనక
తనయ యది, చక్రవాకి భ♦ర్తయగుచక్ర
వాకమును వెంబడించెడు♦పగిది తోఁప. ౬౮౫ 1156

క. తనప్రాణేశ్వరు వెంబడి, చనుదెంచెను నుపవనంబు ♦ సంతసమునఁ జూ
డను బోవురీతి దండక,వనమున కినుమంతయేని ♦ వనటఁ గనక యే. ౬౯ 1157

క. అనుజా! హృతరాజ్యుఁడనై, జనకజనుం బాసి శోక♦సంతప్తుఁడనై
స్వనగరవిచ్యుతి నెంతయుఁ, గను నాపై రవిజునకును ♦ గల్గదు దయయున్.

మ. వినుమా! సౌమ్య! పరంతపా! కుమతి, పృ♦థ్వీపాలుఁ డానూర్యజుం
డు సనాథున్ హృతరాజ్యు, దూరగృహు దీ♦నుం గాముకున్ భీతునిన్
దనుజేంద్రాపహృతాంగనుం గనఁగఁ జి♦త్తంబందు భావించుచున్
దనునే రక్షకుగాఁ దలంచి తన చెం♦తం జేరి సల్లించుచున్. ౭౧ 1159

తే. ఇన్నియు మనంబునం దిడి ♦ నన్ను నాద
రింప కవమానితుం జేసె ♦ రీతి యిద్ది
యొప్పునే! లక్ష్మణా! శర♦త్తొగిని రాఁగ
సీత వెదకంగఁ బంపుదుఁ ♦ గోఁతులనని. ౭౫ 1160

క. సమయంబుఁ జేసికొని దుష్టమతియుఁ గావునను దాని♦సరణి మఱచి కా
ర్యముతీఱె నాకిఁ కేమని, సముదుండై తెలియఁడు నను ♦ స్వాంతమునందున్.

క. చనుమా! కిష్కింధకు నీ, వనిశము గ్రామ్యసుఖములనె ♦ యాసించెడు మూ
ర్ఖుని సుగ్రీవునిఁ గని నే, ననినట్లుగ నిట్లులనుమ ♦ యాతనితోడన్. ౭౦ 1162

సీ. "తనకు మున్నుపకార♦మును జేసి తన్నును శరణుచొచ్చియుఁదన♦సాయముననె
కార్యమున్ ఫలియింపఁ♦గాఁ జేసికొనఁగోరి యున్నవారల కెవ్వఁ♦డుర్విఁగార్య
మును దీర్చియిచ్చెద ♦ నని ప్రతిజ్ఞను జేసి యాశఁ గల్పించి ని♦రర్థకంబు
గా దానిఁ జేయునో♦కపటి యాతఁడె పురుషాధముండగు నెవ్వఁ♦డైనఁగాని

తే. మంచిదో చెడ్డదో తన♦మాట తప్ప
కుండ సత్యముగాఁ దీర్చు♦నో యతండు
పురుషరత్నంబు వీరుండు ♦ పూజ్యుఁడునగు;
నెవరు మిత్రులవలన స్వ♦కృత్య మెల్ల. ౭౨ 1163

చ. ఒనరుచుకొంచు మేలుగని ♦ *స్వోపకృతుల్ తమకార్యమించుకై
నను గొనసాగమిం బొగుల ♦ నైజహితంబును జేయమాని వా
రిని గనకుందురో గుణద♦రిద్రులు వారలు మృత్యువొందఁగాఁ
దినవు తదీయమాంసము మ♦దిం గడుఁరోయుచు మాంసభుక్తతుల్." 23

* స్వోపకృతుల్ = తమకుపకృతి చేసినవారు.

చ. అనివచియింపు మేను సమ♦రాంగణమందు సువర్ణపృష్ఠమా
ధనువును లాగునప్పుడు ని♦తాంతతటిత్తతిఁ బోలుదానిదా
ఘనతరరూపముం గనఁగఁ ♦ గాంతువహించెదు నేమొ? *తీవ్రరు
క్తనయుఁడు నిశ్చయించిది; క్రు♦ధంగని నేనును యుద్ధభూమిలోన్. ౨౪ 1165

క. ధనువును లాగఁగ జ్యాలత, ఘనభీకరఘోషమును ద♦గన్ వజ్రమహా
ధ్వనిసమమును మరలన్ రవి,తనయుఁడు వినఁదలఁచెనేమొ?♦తనమదిగలఁగన్.

క. నరవరపుత్త్రా! వీరా!, గురుసాలద్రుమగణంబుఁ ♦ గూల్చుట వాలిన్
దురమునఁ జంపుటచే నా, పరాక్రమము నెఱిఁగి సూర్య♦పట్టి మనమునన్.

తే. నీవు పెనుప్రాపుగా నుంట ♦ నెఱి నెఱింగి
యును బ్రతిజ్ఞను దప్పిన ♦ నను వధించు
రాముఁ డంచును దా విచా♦రమును బూన
కున్నవాఁడేమొకో? చెప్ప♦వన్న యనుజ. ౨౬ 1168

చ. పరపురభంజనా! యమర♦పాలకపుత్త్రుని జంపి సఖ్యముం
గరమునఁ జేయిపెట్టి తమిఁ ♦ గ్రాల నొనర్చుటయన్న యిట్టికా
ర్యరతికిఁ బూనుటెందులకొ? ♦ యీవిధ మిప్పుడు తాఁ గృతార్థుఁడై
సరసిజమిత్త్రపుత్త్రుఁ డిట ♦ స్వాంతమునందు నెఱుంగఁ డక్కటా!. ౨౭ 1169

క. వనచరపతి వర్షర్తువు, చనినంతనె వత్తుననుచు ♦ సత్యము వచియిం
చెనుగాని నాల్గునెలలుగ, వనితాకేళులను దేలి ♦ వారనితృప్తిన్. ౨౮ 1170

తే. ప్రతిన తప్పుట నెఱుఁగఁడు ♦ బంధుసచివ
సంయుతుండయి త్రాగి యి♦చ్ఛావిహార
కలితుఁ డయ్యెనుగాని శో♦కమునఁ దప్త
మనసులం గుందు మనలను ♦ గనఁడు కరుణ. ౨౯ 1171

క. కనుకన్ వత్స! మహాబల!, చనుమా! కిష్కింధ కీవు ♦ సరగునఁ జని నా
ఘనరోషరూపమును నా,తనికిం దెల్పుచు మదుక్తిఁ ♦ దగ నిట్లనుమా. ౩౦

క. "వినుమా! సుగ్రీవా! నా,ఘనశరహతుఁ డౌచు వాలి ♦ కడువడి మీఁదన్
జనెనో యేమార్గంబున, వినాశమును బొంద దదియు ♦ విస్తృతమయి తగున్.

చ. కనుకనె యగ్నిసాక్షికము♦గా నొనరించినసఖ్యముం బ్రతి
జ్ఞను మఱువంగఁబోకు, మటు♦కాక ప్రతిజ్ఞను దప్పి వాలియే
గినగతిఁ బట్టిపోకు; మనిఁ ♦ గేవల మొక్కని వాలినే శరం
బునఁ బడవేసినాఁడ మును ♦ పూనిక నిప్పుడు నేను నిన్ననిన్. ౩౧ 1174

తే. సత్యవాక్యము వదలుట ♦ శరముపైచి
బంధుయుతముగ వధియింతుఁ ♦ బౌరుషమున;"

* తీవ్రరుక్తనయుఁడు=సూర్యపుత్త్రుఁడగుసుగ్రీవుఁడు.

నని వచింపుము పురుషవ♦ర్యా! మఱియును
గార్యరీతిని బట్టి యి♦క్కాలమునకు. ౧౭౫ 1175

క. హితమగు నేయేవాక్యము, మతివిభవము తోఁపఁ బలుకు ♦ మఱి సమయమ్మ్యా
[1]గతి మీఱరాదు, త్వరపడుము తగం జని వానరౌఘ♦ముఖ్యునితోడన్. ౧౭౬

చ. వనచరనాథ! నాకొఱకు ♦ వారక చేసెదనంచు నీవొన
ర్చిన ప్రతినన్ దృఢంబుగను ♦ జేయుట శాశ్వతధర్మమం చొగిం
గనుఁగొని సత్యమార్గమునఁ ♦ గార్య మొనర్పుము; చేయకున్న నే
ననిమొన వైచుబాణముల ♦ నార్తిని బొందుచుఁ గూలి వాలినిన్. ౧౭౭ 1177

ఆ. ఇపుడె చూడఁగలవు ♦ తపనపుత్రునిలోక,మొంది యట్టిగతిని ♦ బొందఁబోకు;
మని వచింపుమనుచు ♦ నాడినరాముని, నతివివృద్ధకోపు ♦ నన్నుఁగాంచి. ౧౭౮

క. దీనుండై పలవింపఁగ, మానసమునఁ జింతనొంది ♦ మనుజేంద్రునిన
తూనుఁడు లక్ష్మణుఁ డుగ్రత,వానరపతియందుఁ దాల్చె♦బహుళాగ్రహమున్.

ముప్పదియవ సర్గము సంపూర్ణము.

---

### ౩౧ - వ సర్గము.

లక్ష్మణుఁడు కోపముతో వచ్చుచున్నాఁడని యంగదుఁడు సుగ్రీవునకుం దెల్పుట.

సీ. నర[2]దేవపుత్రుండు ♦ సురసంఘపూజితుం డైనరాఘవుఁ డిట్టు ♦ లతిశయమగు
కామంబుచేఁ బీడఁ♦గాంచి దీనుండయి శోకాభిపన్నుఁడై ♦ సొక్కి తీవ్ర
కోపంబుఁ దాల్చి వి♦గూఢసత్త్వుండయి యుండుటఁ గనుఁగొని ♦ యుగ్రతేజుఁ
డగులక్ష్మణుం డప్పు ♦ డన్నతో నిట్లను; మిత్రసమానమై ♦ మెలఁగుచున్న

తే. కష్టసుఖములు తానును ♦ గాంచియుంట
సజ్జనాచారమగుదాని♦ సజ్జనతఁడు
నిలిచి యుండఁడు రాముతో ♦ నెమ్మిగనుట
వలనఁగద కపిరాజ్యము ♦ వచ్చెననుచు. ౧౪ 1180

క. వనితాసమాగమాదు ల,తనికృపచేఁ గల్గె ననెడు♦తలఁపుఁ గనఁడు సూ;
నునయుం దనుకూలముగా, దనవర్తన ముంచి నడువఁ♦దగు ననుబుద్ధిన్. ౨

తే. తాను బూనఁడు గావున ♦ వానికింక
వానరేశ్వరరాజ్యము ♦ వైభవంబు
దక్క దోవీర! మఱిలే క♦తండు తుచ్ఛ
సౌఖ్యములఁ బొంది నీవు రా♦జ్యం బొసఁగుట. ౨। 1182

1 త్వరకాలవ్యతిక్రమః-అనిమూలము. 2 "దే" యను యక్షరము గాయత్రియం దేకా
దశాక్షరము.

క. వనితను నిప్పించుటయుఁ, గనఁజాలఁడు నీదుకృపకుఁ♦గాఁ బ్రత్యుపకా
రనిరతి బొందఁదగునని, యును దలఁపఁడు గాన నిప్పు♦డొగి నాచేతన్. ౨౹

క. హతుఁడై తనయన్నను నా, శతమఖసుతుఁ జూచుఁగాక; ♦ క్ష్మారాజ్యం బీ
కృతమెఱుఁగని దుర్గుణునకు, మతిఁ గరుణను నీయరాదు ♦ మాటలిఁ కేలా. ౩

క. సముదీర్ణభూరిరుడ్వే, గము నే భరియింపఁజాలఁ ♦ గావున నే స
త్యము దప్పిన సుగ్రీవుని, యముపాలికిఁ బుత్తు వాలి♦యాత్మజుఁ డిపుడే. ౩౹

చ. వనచరవీరులం గలిసి ♦ వారిజలోచన సీత జాడనుం
గనుఁగొన నేగుఁగాక; యని ♦ క్రన్ననఁ బల్కిన శత్రుహంతయై
ఘనకరుణాకరుండనఁగఁ ♦ గ్రాలెడురాముఁడు తమ్ముఁడట్లుగా
నని నొనరింపఁ దీవ్రతర♦మా క్రుధఁబూనుచు సజ్యచాపుఁడై. ౪౹ 1186

[1]ఉ. తా నొనరింపఁబోవుపని ♦ దారుణరీతిని బల్కి పోవఁగా
మానసమందు నెంచి యస♦మానపరాక్రమ మొప్పనున్న యా
మానితు లక్ష్మణుం గనుచు ♦ మంగళదాయకసామవాక్యముల్
తానిటుపల్కె రాఘవుఁడు ♦ తమ్ముఁడ! త్వద్విధవీరుఁ డిద్ధరన్. ౫ 1187

తే. ఎవ్వఁడైనను జూడుమా! ♦ యిట్టిమిత్ర
వధసమాగతపాపంబు ♦ వార కొనరఁ
జేయ నెంచునె! యివ్విధిఁ ♦ జేసి యఘముఁ
బొందుట తటస్థపడినయ♦ప్పుడు హితమతి. ౫౹ 1188

ఆ. తనవివేకమహిమ ♦ దానిని దొలఁగించు, కొనునొ యట్టివీర♦కుంజరుండె
పురుషసత్తముఁడగుఁ ♦ బూజ్యవృత్తిని గల్గు, నీవె యిట్టిపనికిఁ ♦ బోవరాదు.

క. మును చేసిన యానఖ్యం, బును జక్కఁగ ననుసరించి ♦ ముందటిప్రీతిన్
వనచరపతిపై నునుపుము;, వనజాప్తునితనూజుఁడు తనదు♦పనిఁ దరుణమునన్. ౭

క. ఒనరింపఁడు కావున నా, తనితోఁ బరుషోక్తులాడఁ ♦ దలఁపక సామం
బును హితమునైన వాక్తతి, ఘనమునఁ గ్రుధమాని పలుకు♦మహితవిచారా!.

[2]క. అనియిట్టు లగ్రజుచే, నను శిష్టాజ్ఞుఁడయి పోయె ♦ నాకిష్కింధన్
గనుఁగొనఁ బరవీరసమూ, హనిరాకరణోగ్రశౌర్యుఁ ♦ డగులక్ష్మణుఁడున్. ౯

క. పురిఁ జేరి శుభమనీషుఁడు, నిరుపమమతివైభవుండు ♦ నిర్మలగుణుఁడున్
బరమాప్తుఁడునై తగు నా, స్థిరశౌర్యుఁడు కోపముడిగి ♦ స్థిరతరశాంతిన్. ౧౦

క. వనచరనాథుని సౌధం, బునకేగెను; బ్రళయకాల♦మున యముఁడనఁగాఁ
దనరారు లక్ష్మణుఁడు శ, క్రునిచాపముఁ బోలి శైల♦కూటాభంబై. ౧౦౹

1 ఉవాచ రామః పరవీరహంతా స్వవేక్షితం సానునయంచ వాక్యమ్-అనియూ. పరవీరహంతా-అనుదానియర్థము లోపలిపద్యమునఁ జెప్పఁబడినది 2 ప్రవివేశ పురీం వీరో లక్ష్మణః పరవీరహా-అనియూ.

క. కనఁబడుచాపము దాలిచి, ఘనసానువు లొప్పుచుండఁ♦గాఁ దగు శైలం
బును మందరమును బోలుచుఁ, గనఁబడియెను జూచువారు♦గడుభయమందన్.

¹సీ. మఱియందు నాబృహ♦స్పతితుల్యుఁడౌ సుమిత్రాత్మజుం డగ్రజు♦నాజ్ఞయందు
నించుకేనియు మీఱ♦కే యొనరించెడువాఁడయి కపినాథు♦తోడఁ దాను
జెప్పఁగాఁ దగి రాముఁ ♦ డప్పుడు చెప్పినమాటల వానికి ♦ మరలఁ గీశ
పుఁడు చెప్పు నుత్తరం♦బుఁ దగఁ దానునువానికొనరనీఁదగినప్ర♦త్యుత్తరంబుఁ

ఆ. దలఁచుకొనుచుఁ బోయె; ♦ నలరామునకుఁ గామ
మునను గ్రోధమునను ♦ జననమంది
నట్టికోపవహ్ని ♦ యపుడు తన్ బైకొన
ననిలుభంగిఁ గుపితుఁ ♦ డగుచుఁ జనియె. ౧౩ 1196

ఆ. అతఁడు మఱియు దారి ♦ కడ్డముగా నున్న, మద్దితాటుల నిను♦మద్దిచెట్ల
నితరవృక్షములను ♦ వితతబాహువులను, ద్రోసి కొండకొనలఁ♦ద్రోసిమఱియు

చ. పలువిధవృక్షజాతులను ♦ బాడొనరించుచుఁ గాళ్లచేతఁ బెన్
శిలలను నుగ్గొనర్చుచును ♦ జెచ్చెఱఁ బోవుగజంబురీతి నా
కులమతియాచు నాత్రమునఁ ♦ గోపమునం దనయగ్రపాద మి
మ్ముల నొకకొంతదూరమునఁ ♦ బోనఁగఁ జిమ్ముచుఁ బెక్కురీతులన్. ౧౪ 1198

తే. కార్యవశమునఁ జేసి వే♦గముగఁ బోయె;
నిట్టు లిక్ష్వాకుకులసింహుఁ ♦ డేగి శైల
మధ్యభాగంబునన్ దుర్గ♦మంబు నగుచు
వానరబలాన్వితంబయి ♦ వఱలుదాని. ౧౪। 1199

క. హరిగణరాజమహాపుర, వరమును గనుఁగొనియె; నంత ♦ వనచరపతిపైఁ
బరఁగెడురోషమునం బ్రస్ఫురమాణోష్ఠుఁడయి యప్డు ♦ పురబాహ్యమునన్.

క. చరియించువారలన్ భీకరరూపులఁ గీశవరులఁ ♦ గనియెన్; వారున్
బురబాహ్యస్థలిఁ దిరుగుచుఁ, గరిపతిరూపములఁ బోలి ♦ క్రాలుచు నంతన్.

చ. పురుషవరేణ్యు లక్ష్మణుని ♦ బోలఁగఁ గాంచి యితండు శత్రువా
నరయుఁగ నంచు నెంచి యట ♦ నగ్గిరిమధ్యతలంబునందు భూ
ధరఘనశృంగముల్ తరువి♦తానము నూఱులసంఖ్యగొంచు సం
గరమున కాయితంబయిరి; ♦ కారణ మేమియులేక వానరుల్. ౧౭॥ 1202

తే. ఆయుధంబులఁ గైకొను ♦ టరసి కోప
మినుమడింపఁగ లక్ష్మణుఁ ♦ డింధనములు
మిగులఁ గలయగ్నిహోత్రుఁడు ♦ మించునట్లు
ప్రజ్వలించెను; నంతఁ గో♦పమున నతఁడు. ౧౮॥ 1203

1 ఈపద్యమున మూలార్థమే వ్యాఖ్యాభిప్రాయమున విస్తృతమని తెలియునది.

క. ప్రళయాంతకువలెఁ గనన్నై, జ్వలితాగ్నిసమానుఁ డౌట ♦ నరగునఁ గని వా
రలు భయపరీతతనువులఁ, గలఁగుచు గుమిగూడి నాల్గు♦కడలకుఁ ద్వరతోన్.

క. పరుగిడి యాకపులందఱు, హరిపతిసౌధంబుఁ జొచ్చి ♦ యలలక్ష్మణుఁ డా
తురమునఁ గ్రోధంబున మన, పురమున కేతెంచె ననుచుఁ♦బొందుగఁ దెలుపన్.

చ. వనచరునాథుఁ డత్తఱిని ♦ బంచశరాగ్నిని గుంది యొక్కటం
దనప్రియురాణిఁ దారను ని♦తాంతముదంబునఁ గూడి కేళిచేఁ
[1]దనువెఱుఁగండు కానఁ గపి♦తల్లజు లాడినపల్కు లేమియున్
వినకయెయుండె; నంతఁ గపి♦వీరునిమంత్రులు జాగరూకులై. ౨౨॥ 1206

[2]ఆ. అరసి రండు వార్త ♦ ననిపంపఁగా రోమ,హర్షణములఁ బొలుచు♦నట్టి కపులు
హస్తిశైలనీర♦దాకృతులం గనఁ,బడుచుఁ బురమునుండి ♦ వెడలి రంత. ౨౩॥

సీ. దంతాళినఖరాయు♦ధములుగా నొప్పుచు భయదరూపంబులఁ ♦ బరఁగి వికృత
దర్శనులై, వ్యాఘ్ర♦దర్పులై వికృతాస్యముల నొప్పి యందఱు♦చెలఁగిరందు
దశహస్తిబలులు కొం♦దఱు, మఱికొందఱు శతనాగబలులు, ద♦శశతనాగ
బలులు కొందఱునయి ♦ పరఁగుచునుండిరి; కోపంబునన్ నృప♦కుంజరుండు
తే. బలయుతులు వృక్షహస్తులు ♦ పరమవీరు,లైన వానరనాయకు ♦ లంతటను జె
లంగుచుండఁగ నెట్టిబ♦లయుతులకును, [3]జేరరానట్టులున్న కి♦ష్కింధఁగనియె.

తే. చండబలులైన యావన♦చరవరు లొగి
రమణఁ బ్రాకారపరిఘాంత♦రముననుండి
వెడలి లక్ష్మణునకు నగ♦పడువిధమున
నిలిచి రంతట; సుమతియై ♦ వెలయునతఁడు. ౨౮॥ 1209

క. వనచరనాథుప్రమాదం,బును జ్యేష్ఠుండైనరామ♦భూపతియార్తిం
గని యుంటయుఁ దలఁచుచుఁ గో,పనిరతిమరలంగనియెను♦బహుభంగులుగన్.

తే. కోపమున దీర్ఘములగుచు ♦ గొప్పవియగు
వేఁడినిట్టూర్పుగములను ♦ విడిచి యతఁడు
లెఱ్ఱఁబాఱఁగఁ బొగతోడ ♦ నెసఁగువహ్ని
కరణి లక్ష్మణుఁడొప్పె నా♦కాలమందు. ౨౯॥ 1211

[4]క. శరశల్యచలజ్జిహ్వుఁడు, శరాసనఫణుండు స్వీయ♦చంచత్తేజో
గరళుఁడు నయి పంచానన, సరీసృపముపోలె వెలసె ♦ సౌమిత్రి యటన్. ౩౦॥

క. జ్వలితప్రళయమహానలు,వలెఁ, గుపితుండైన శేషు♦వలెఁ దగునాభూ
[5]పలలాముచెంత కంగదుఁ, డలుకుచుఁ జని దుఃఖమొందె ♦ నాత్మ న్మిగులన్.

1 న తేషాం కపివీరాణాం శుశ్రావ వచనం తదా-అనిమూలము. 2 హరయో రోమహర్షణాః-అనిమూలము. 3 అపశ్యల్లక్ష్మణః క్రుద్ధః కిష్కింధాం తాం దురాసదామ్-అనిమూలము. 4 పంచాస్య ఇవ పన్నగః-అనిమూలము. 5 సమాసాద్యాంగదస్త్రాసా ద్విషాద మగమ ద్భృశమ్-అనిమూలము.

చ. ఘనయశుఁడై నలక్ష్మణుఁ డ♦ఖండరు షావిలనేత్రయుగ్ముఁడై
వనచరనాయకాత్మజుఁడు ♦ వచ్చుటఁ దాఁ గని వత్స! యల్లరా
మునియనుజుండు శాత్రవస♦మూహాయముండు సుమిత్రసూనుఁ డో
య్యన నిదె వచ్చినాఁ డనుచు ♦ నాకపినాథునితోడఁ జెప్పుమా!. ౩౩ 1214

క. రామునకుం గలవ్యసనము,చే మది తపియింప ద్వార♦సీమ నిలిచియే
సౌమిత్రియున్నవాఁ డని, నామాటల నిట్లు తెలుపు ♦ నగచరపతికిన్. ౩౩౹

తే. అతనిమాటలయందు నీ♦కభిమతంబు, గలినట్లైన నతనిచెం♦గటికి నీవు
చనుటయో నీదుసన్నిధి♦కిని నతనిని, వచ్చునట్లొనరించుటో ♦ భవ్యరీతి. ౩౪

క. మనసున కెయ్యది యుక్తం, బని తోఁచునో యట్లుచేయు♦మని యీవాక్యం
బును జెప్పి యరిందమ వ,త్స! నీవు వేగంబ రమ్ము ♦ తడయకు మచటన్. ౩౪౹

చ. అనియిటు లక్ష్మణుండు క్రుధ♦నాడినమాటల నాలకించి వే
చని పయికొన్నశోకమున ♦ స్వాంతము దూలఁగఁ బిన్నతండ్రినిం
గని యిదె లక్ష్మణుం డలుకఁ ♦ గందుమనంబున వచ్చియున్నవాఁ
డని వచియించె; నంతట బ♦లాధికుఁ డంగదుఁ డాత్మదూలఁగన్. ౩౫౹ 1218

తే. లక్ష్మణునివాక్యములకు ను♦ల్లమునఁ జింత
పొడమ సంభ్రాంతుఁడై తెల్లఁ♦బోవుమోము
తోడ వేచని భక్తితోఁ ♦ గూడి యతని
చరణముల కట్టి మ్రొక్కుచు ♦ జనని కెరఁగి. ౩౬ 1219

క. పినతల్లియైన రుమ పద, వనజములకు నట్లె మ్రొక్కి ♦ వచ్చినపనిఁ దె
ల్పెను బూసగ్రుచ్చినట్టుగ;, వనచరపతి నిద్రమబ్బు♦వలన న్మఱచియున్. ౩౬౹

ఆ. మద్యపానజనిత♦మదమువలనను మై, మఱచియుంటవలన ♦ మరులుగొనుచు
బుద్ధి చెడుటవలనఁ ♦ బూనిననిద్రను, వనలకుండె నంత ♦ వానరులట ౩౭౹

చ. అనఘుని లక్ష్మణుం గని భ♦యాతురులై క్రుధ నూని యున్నయా
తనిని బ్రసన్నుఁ జేయుటకుఁ ♦ దారు కిలార్భటు లొప్పఁజేసి; రం
*త నతఁడు గొప్పప్రోదినిపి♦ధంబున నడ్డములేక వచ్చుటం
గని గుమిఁగూడి యొక్కమొగి♦గా ఘననాదము పెల్లురేఁగఁగన్. ౪౦ 1222

తే. అశనివజ్రంబులను బోని♦యట్టి సింహ
నాదమును జేసి రతనిచెం♦తను గపీంద్రుఁ
డాధ్వనికి మత్తుచేతఁ దా♦ మ్రాత్ముఁడగుచు
వ్యాకులస్రగ్విభూషణుం ♦ డగుచు బెదరి ౪౧౹ 1223

ఆ. మేలుకొనియె; నంత ♦ మిగుల మంత్రాలోచ
నమున నేర్పుగలిగి ♦ నయమతులయి

* తే మహౌఘనిభం దృష్ట్వా-అనిమూలము. మహాప్రవాహతుల్యమ్-అని వ్యాఖ్య.

యర్కజునకు మిగుల ♦ ననుకూలులయి యంతి
పురికి నేగఁదగిన♦పూజ్యతఁ దగి. ౪౨ 1224

తే. తనరు ప్లక్షప్రభావులు♦నను సచివులు, వాలితనయుఁడు చెప్పిన♦వాక్యము విని
యతనితోఁ గూడి సుగ్రీవు♦నంతిపురముఁ, జొచ్చి యర్థధర్మంబుల♦సచ్చరితము.

క. వినిపింపఁగ బహుభంగుల, ననఘుఁడు శ్రీరామచంద్రు♦ననుజుఁడు వే వ
చ్చినవాఁడని సుగ్రీవున, కనుమానము మాని పలికి ♦ రంతట వారల్. ౪౩॥

సీ. అమరనాథునివలె ♦ నమలసింహాసనమునఁ గూరుచుండిన♦వనచరేంద్రు
సామనిశ్చితసువా♦క్యోన్నమంబునఁగ నుప్రసన్నునిఁ గావించి ♦ సన్నిధాన
మునఁ గూరుచుండి యి♦ట్లనిపల్కె; రారాఘవులు మహామతివిశే♦షులునుసత్య
సంధులు సోదరుల్ ♦ సఖులు రాజ్యంబును బాలింప నర్హులు ♦ వానరేంద్ర!

తే. వారు రాజ్యంబు నీకు నీ♦వగున నిచ్చి
నట్టివారుగదా! వారి♦యందు నొక్కఁ
డైనలక్ష్మణుఁ డిదె ధను♦ర్హస్తుఁ డగుచు
వచ్చి నిలిచియె యున్నాఁడు ♦ ద్వారమందు. ౪౬ 1227

*చ. వనచరు లాతనిం గనుచు ♦ ప్రాంతములెల్లను గంపమొంద నా
నినదము సేయువా; రతఁడు ♦ నీకడకుఁగ రఘువీరువాక్యమే
దనకును సారథిత్వమునఁ ♦ దద్దయు నొప్పఁగ వైరినాశనం
బనురథమెక్కి వచ్చెఁ దన♦యుగ్రజశాసన మూని యోనృపా!. ౪౭॥ 1228

క. అనఘా! తారాప్రియపుత్రుని నంగదు, నితనిఁగూడఁ ♦ దోండరపడి రా
మునితమ్ముఁడు నీయొద్దకు, ననిచినవాఁ డగచరేంద్ర! ♦ యాలక్ష్మణుఁడుఁగ ౪౮॥

క. నిరుపమవీర్యంబునఁ దగి, పరఁగెడురోషంబు నేత్ర♦పద్మంబులఁ దోఁ
ప రయమున దృష్టి నీవన,చరులఁగ దహియించురీతి ♦ శౌర్యము పొంగఁగ.

తే. ద్వారమునఁ గాచియున్నాఁడు ♦ త్వరఁగ నీవు
తనయబాంధవయుతుఁడవై ♦ చని యతనికి
శిరము సోఁకఁగ మ్రొక్కి యొ♦క్కరణినైన
నతనిరోషము నార్పుమా ♦ యగచరేంద్ర!. ౫౦॥ 1231

తే. ధర్మమతియైనయారాముఁ ♦ దర్మిలి దగ
నేమిచెప్పెనో యద్దాని ♦ నిపుడె తప్ప
కొనరఁ జేయుము నీప్రతి♦జ్ఞను నెఱపుము
గౌరవముఁ గాచుకొనుము నే♦గమునఁ జనుము. ౫౧॥ 1232

ముప్పదియొకటవ సర్గము సంపూర్ణము.

---

* లక్ష్మణో వాక్యసారథిః వ్యవసాయరథః ప్రాప్తః-అనిమూలము.

## ౩౭ - వ సర్గము.

### హనుమ సుగ్రీవునకు హితము చెప్పుట.

క. అనవిని మతిమంతుండగు, వనచరపతి పుత్రమంత్రి ♦ వాక్యవితతులన్
విని లక్ష్మణుండు కుపితుం, డని యెఱిఁగి వసించియున్న ♦ యాసనము దిగెన్. ౧

తే. మంత్రకుశలుఁడు గావున ♦ మంత్రవేత్త
లగుచు మంత్రంబులందె య♦త్యంతనిష్ఠ
గలిగి గురులాఘవంబులఁ ♦ దెలియఁజాలు
మంత్రులం గాంచి యిట్లని ♦ మాటలాడె. ౨ 1234

చ. పరుషములాడ లేదు గరు♦వంబునఁ దప్పి సుమంతయేని యే
నరయుక చేయ లేదు క్రుధ ♦ నందగ నేలొకొ లక్ష్మణుండు దా
శరథిసహోదరుం డనుచు ♦ స్వాంతమునం దలపోయువాఁడ; నం
తరముల సర్వదా వెదకఁ ♦ దత్పరులైన మదీయశత్రువుల్. ౩॥ 1235

క. నిరతము దురాత్ములౌటం, దరుణం బిదె యనుచు దోష♦తతుల న్నాయం
దరసినయైనను గానం, దరంబు గానట్టివాని ♦ దాశరథికినిన్. ౪ 1236

క. తెలియం జెప్పిరె యుందురు;, తలపోయుఁడు ముందుముందె ♦ తగ నీవిషయం
బుల బుద్ధినైపుణంబుల, కొలఁదిన్ సక్రమముగాఁగఁ ♦ గ్రుధకారణమున్. ౪॥

తే. దానికెయ్యది పరిహార♦మూని చేయఁ
దగునొ మనమిప్పు డివియెల్లఁ ♦ దథ్యముగను
దెలిసికొనఁదగు; లక్ష్మణు♦వలనఁ గాని
రామువలననుగాని నా♦కేమియైన. ౫॥ 1238

క. కలుగునొ భయమని నే నా,కులపాటొందంగ లేదు ♦ కుందును దానన్
గలుగదు రవంతభయమును;, జెలికాఁడగువాఁ డహేతు♦సిద్ధాగ్రహమున్. ౬

ఆ. కలిగి యున్నయెడలఁ ♦ గలుగక యుండునే, యెట్టివారికైన ♦ నెదను సంభ్ర
మంబు; మిత్రునొకని ♦ మహిని సంపాదించు, టధికసులభమైన♦యట్టిపనియె.

క. ఆమైత్రిని రక్షించుట, యేమాత్రము దుష్కరమగు ♦ నెన్న హృదయముల్
భూమి నొకరీతి నుండక, వేమఱు చపలంబు లగుచు ♦ వింతగ నుండున్. ౬॥

సీ. కాన నొక్కించుక ♦ యైన వైషమ్యంబు గలిగిన నయ్యది ♦ విలయ మొందు;
మహితాత్ముఁడగు రఘు♦నందనుం డనురక్తి నాకుఁ గావించిన ♦ ప్రాకటోప
కారమునకుఁ బ్రతీ♦కారము చేయంగ శక్యమే గాదు ని♦శ్చయము నేను
నీహేతువునకయి ♦ యే భీతినొందెద; నని చెప్పువనచరే♦శుని పలుకుల

తే. విని హరీంద్రుఁడు హనుమంతుఁ ♦ డనియె సచివ
మధ్యమంబునఁ దనయూహ ♦ మండితంబు

గాఁగ; సన్మిత్త్రుఁడయి యుప♦కారకర్త
యైనరాముని నీయట్టి♦యనఘుఁ డెపుడు. ౯౺ 1242

క. మనమున మఱువక యుండుట, యనునది యిసుమంతయైన ♦ నాశ్చర్యముగా
దు నృపా! వీరుండగు నా, జనపతి రాముండు సాధ్వ♦సము నొందకయే ౧౦౺

తే. త్వత్ప్రియార్థము శక్రుని♦వంటి శౌర్య,నంతు నవ్వాలిఁ జంపె; నీ♦పైఁ సమస్త
విధములం బ్రణయంబున ♦ వింతకోప, మూని శ్రీవర్ధనుని నవ్వస♦హోదరు నిట.

క. నీయొద్దకుఁ బుత్తెంచెను, నేయనుమానంబులేదు ద♦హీనగుణాఢ్యా!
యోయగచరనాథా! విను, మీయవనిం గాలవిదుల ♦ కీవ పతివి నూ!. ౧౩

క. ఐనఁ బ్రమత్తుఁడ వగుటన్, గానవు కాలంబుఁ జక్కఁ♦గాఁ బూచుచుఁ బెం
పూనిన సప్తచ్ఛదసం,తానంబున శ్యామమగుచుఁ ♦ దగువిభవమునన్. ౧౪

సీ. అలరు శరత్సము♦యంబు వచ్చినయది నభమున మేఘసం♦తతి నశించె
నిర్మలకాంతుల♦నెగడెఁ దారాగ్రహంబులు దిక్కులును విది♦క్కులు నదులును
సరసులుఁ జాలఁ బ్ర♦సన్నములై యున్న వోహరిపుంగవా! ♦ యుద్ధమునకు
యత్నము సేయంగ ♦ నగు తఱివచ్చెను దెలియకున్నావు, సం♦తృప్తినొంది

తే. యున్ననిన్నుఁ బ్రమత్తుగా ♦ నెన్ని లక్ష్మ
ణుండు వచ్చినవాఁడు గ♦నుంగొన నిను
స్పష్టమిది, యార్తుఁడై హృత♦భార్యుఁ డగుచు
రాముఁ డమ్మహానీయుఁ డ♦రాతియముఁడు. ౧౫౺ 1247

క. పురుషాంతరమునఁ బంపిన, పరుషోక్తుల నీవు సైప♦వలయుం జుమ్మీ!
గురుతరమగు నపకార మొ,నరిచితి వీ వప్పటివచ♦నము దప్పుటచేన్. ౧౬౺

తే. కాన నంజలిఁ గీలించి ♦ మాననీయు
నతనిని బ్రసన్నునిగఁ జేయు♦నంతకంటెఁ
దగినప్రాచిత మొక్కటి ♦ యగపడదిఁక;
[1]హీనకృత్యము చేయుట ♦ యెట్లనెదవో!. ౧౭ 1249

సీ. అవనిపాలనియుక్తు ♦ లైనమంత్రులు పతికెంతయు హితమునే ♦ యెపుడు ప్రీతి
బోధింప వలయుఁ గా♦వున నే నిపుడు భీతి వదలి తోఁచినరీతి ♦ వదరినాఁడఁ
జాపము కైఁదాల్చి ♦ భూపతి క్రుద్ధుండై యైనచో గంధర్వ ♦ లమరు లసురు
లమరఁ బోల్చెడు జగం♦బంతయుఁ దనవశంబయియుండునట్లు చే♦యంగఁగలఁడు

[2] తే. వనచరేశ్వర! యెవఁడు కో♦పంబు నొందు
నప్పుడు ప్రసన్నుగాఁ జేయ ♦ నర్హుఁడగునో
యట్టిమహానీయుఁ గోపంబు ♦ నందఁ జేయ
రాదు; పూర్వోపకారస్మ♦రణమువలన. ౧౮౺ 1250

1 ఈపాదము వ్యాఖ్యయందున్న యాపతౌరికపఁ దెసుఁగు. 2 నసక్షమః కోపయితుం యః ప్రసాద్యః పున ర్భవేత్ -అనిమూలము.

క. ధరణిం గృతజ్ఞుం డనఁగాఁ, బరఁగెడువాఁ డట్టివానిఁ ♦ బరికించి క్రుధం
ద్వరపడువానిఁగఁ జేయం,గరాదు; వాసరవిభూ! త♦గ నీవెలమిన్. ౨౦

క. తనయునితో బంధులతోఁ, జని యాతనిపాదములను ♦ స్వశిరము సోఁకం
గ నమస్కారము చేయుము;, పెనిమిటివశమందు భార్య ♦ ప్రియ మలరారన్.

క. ఉండెడుగతిఁ దద్వశమున, నుండుము నీవ్రతినఁ దప్పు♦కుండుము విద్వ
న్మండలము మెచ్చుఁ దీర్పుము, దండితరిపువార! సూర్య♦తనయా! వినుమా!.

క. రామునివాక్యము గానీ, రామానుజవాక్యమైన ♦ రాజా! మదిలో
నేమాత్రమైన మీఱం,గా మంచిదిగాదు భూప♦కాంతుండగుచున్. ౨౧

తే. శక్రవర్చసుఁడౌ రఘు♦సత్తమునియు
నతనియనుజునియును మహో♦స్త్రాళిబలము
మానుషంబగుబలమును ♦ మదిని నీకె
తెలిసియేయున్నయదిగద ♦ తృప్తిమీఱ. ౨౨ 1255

ముప్పదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## 33 - వ సర్గము

అంతఃపురమున లక్ష్మణుని తార ప్రసన్నునిఁ జేయుట.

చ. అనిపలుకంగ నంతట స♦హస్రకరాత్మజుఁ డంగదాహ్వయుం
దనయునిఁ బంప రాఘవుని ♦ తమ్ముఁడు రామునిశాసనంబునన్
జని భయదంబుగాఁ దగి వి♦శాలగుహాకృతి నున్నయప్పురం
బును ద్వరఁ జొచ్చె; ద్వారమునఁ ♦ బొల్చిరి భూరిబలల్ మహాతనుల్. ౧

క. ఆవనచరు లాలక్ష్మణు, వావిరిఁ గని ప్రాంజలులయి ♦ భక్తి నిలిచి ర
ట్లావిధిఁ గ్రుద్ధుండై రఘు, భూవరపతిసోదరుండు ♦ పొంగెడు క్రుధచేన్. ౨

క. నిట్టూర్పులఁ బుచ్చుచుఁ బద, ఘట్టనముల ధరణి యద్రువఁ♦గా రాఁగని యా
దిట్టరిఁ గని భయపడి వా, రట్టె నిలిచి రతనిచెంత ♦ కరుగగ లేమిన్. 3 1258

సీసమాలిక:—

శ్రీమంతుఁడైన యా♦క్షితిపపుత్రుం డప్డు రత్ననిర్మితమయి ♦ రత్నమయము
లైన యంగళ్లతో ♦ సతిరమణీయమై పుష్పితకానన♦పుంజ మగుచు
భూరికందరమును ♦ బోలి చెన్నారెడు కిష్కింధఁ గాంచెఁ గ్రి♦క్కిరిసి యందు
*హార్మ్యసౌధంబులు ♦ నలరారుచుండెను విపణివీథులు చాల ♦ వెలసియుండె;
సర్వకామంబుల ♦ సతతంబుఁ దీర్చెడు ఫలవృక్షములు పుష్ప♦భారరమ్య
ములగు భూరుహాములు ♦ విలసిల్లుచుండెను; దేవగంధర్వత♦తికి జనించి

* హర్మ్యప్రాసాదసంబాధామ్-అనిమూలము.

నట్టివారగుటచే ♦ నాత్మకాంతాసనములగు రూపంబులఁ ♦ బొలుచువారు
దివ్యమాల్యాంబర♦భవ్యరూపులు ప్రియదర్శనులును భయ♦దస్ఫుటబలు
తే. లునగు వానరు లందందుఁ ♦ గనఁబడనొగి
నందమైయుండెఁ; జందనం♦బగరు వల్లి
పద్మనామవిలేపన♦భవ్యవస్తు
వులు సువాసన లీయంగఁ ♦ బొలిచెఁ బురము. ౬౪ 1259

సీసమాలిక:—

మైరేయనామక♦మద్యంబులయు మధూకాహ్వయములగుమ♦ద్యములయుఘన
వాసనల్ క్రోవలఁ ♦ బరిణమించుచునుండె, విమలజలంబుల ♦ వెలయుశైల
నదులెల్లఁ గ్రాలంగఁ ♦ బొదలుచుండెను నట్టిపురమును జూచె; న♦ప్పుడుసుమిత్ర
తనయుఁ డంతట నంగ♦దునియుమైందద్వివిదులయుగవయగవా♦క్షులయుశరభ
గజులయు సంపాతి ♦ కపిదియు నల్లి విద్యున్మాలి వీరబా♦హులయు మఱియు
సూర్యాక్ష, కేసరి♦సుత సుబాహులయు మహాత్ముఁడౌ నలునియు♦నల్లి కుముద
జాంబవద్వానర♦సత్తములయు సుషేణునియుఁ, దారునియు నీ♦లునియు నంత
దధివక్త్రునియు సునే♦త్రసుపాటలులయుగేహంబులఁగాంచె; మ♦హాత్ములగుచుఁ
గపిముఖ్యులును నయి ♦ క్రాలెడువీరికి రాజమార్గంబుల ♦ రమ్యములయి
యతులసారములయి♦యందంబులును నగు నాలయంబులు చెలు♦వారుచుండ
నతఁడు గనుంగొనె ♦ నయ్యవి పాండురజలదంబులట్లు ప్ర♦శస్తిఁ గాంచి
భవ్యమాలికలను ♦ భాసిల్లి ధనధాన్యనిబిడంబులయి, తరు♦ణీమణిప్ర
కీర్ణంబులయియుండెఁ; ♦ గిష్కింధనడుమను బాండురప్రాకార♦వలయితమయి
యితరదురాపమై ♦ యింద్రసౌధాభమై రమ్యమై తగు కపి♦రాజసౌధ
మును గాంచె నయ్యది ♦ ఘనతరకైలాసశిఖరాభములు గాఁగఁ♦జెలఁగుచున్న
ప్రాసాదశిఖరముల్ ♦ భాసిల్లుచుండంగఁ దెల్లనై వెలయుచు ♦ నుల్లములరఁ
జేయుచునుండెఁ; గాం♦క్షితముల నీఁజాలు ఫలపుష్పవృక్షముల్ ♦ పరఁగుచుండ
నందమై కనఁబడి ♦ యంతమాత్రమెకాక యమరేంద్రుఁ డిచ్చిన♦యట్టివృక్ష
ములు సిరులొనఁగుచుఁ♦బొలిచినీలాబ్దంబులను బోలికసుమంబు♦లనుఫలములఁ
గ్రాలి శీతచ్ఛాయ ♦ గలిగి రమ్యములయి భాసిల్ల నాసౌధ♦వరము వెలయు
చుండెను; బలముల ♦ నొప్పి శస్త్రంబులఁ గరములఁ దాలిచి ♦ కపులు దాని
ద్వారంబుఁ గాచుచుఁ♦వనరారుచుండిరి; మఱియు నయ్యదిదివ్య♦మాల్యములను
భాసిల్లుచుం దప్త♦భర్మతోరణమున నలరారుచుండె మ♦హాబలుఁడగు
లక్ష్మణుం డాతఱి ♦ లలితమై తగు కపివరుని సౌధంబు న♦వార్యమాణుఁ
తే. డగుచు సూర్యుఁడు జలదంబు♦నందుఁ జొచ్చు
కరణి నందుఁ బ్రవేశించె; ♦ నరగఁ గక్ష్య

లేదు గడచుచు సౌమిత్రి ♦ గూడి యందు
నున్న జనసంఘములఁ గాంచు ♦ చురుజవమున. ౧౮ 1260

క. సంతతధర్మాత్మునఁ డతం, డంతట సంరక్షితమయి ♦ యరుదుగఁ గననౌ
సంతఃపురమును గాంచెను;, వింతగ నాసౌధమందు ♦ వెలయు స్థలములన్.

తే. హైమరాజతశయనంబు ♦ లనుపమాన
ములగు పఱపులుపఱచిన ♦ సులలితా స్త
రణము లెన్నెన్నొ మిక్కిలి ♦ రాజిలంగ
సౌధమది యద్భుతాకృతి ♦ జానుమీఱె. ౧౯½ 1262

చ. త్వరపడి లోనఁ జొచ్చుచునె ♦ భవ్యనినాదముతోఁ జెలంగుచుం
గరమరుదైనవీణియలు ♦ క్రమ్రగతుల్ దగ మీటుచు స్సనో
హరమగుతాళముల్ శ్రుతియు ♦ నంజముగా విననౌటచే సమా
క్షరపదగీతము ల్వెలయఁ♦గా నదియుంటఁ గడుం బ్రియంబుగాఁ
బరఁగుచు వీనులం బడియెఁ ♦ బావనగీతము శ్రోత్రపాత్రమై. ౨౦½ 1263

చ. వరబలుఁడైన లక్ష్మణుఁడు ♦ వానరరాజనికేతనంబునన్
సురుచిరవేషభూషలను ♦ శోభిలుచుం దగ రూపయౌవన
స్ఫురణము నంది చెన్నెసఁగు♦సుందరులం బలుమందిఁ గాంచె; భూ
వరసుతుఁడంత సాధుతమ♦వంశమునన్ జనియించి మించుచున్. ౨౧ 1264

[1]ఆ. చిత్రమాల్యములను ♦ సిగలనిండ ధరించి
మేటిభూషణముల ♦ మించి పండ్లఁ
గొనుటయందు మఱియుఁ ♦ గుసుమాళిఁ గట్టుట
యందు నేర్పు గలుగు ♦ నతివలఁ గనె. ౨౨½ 1265

క. ధనధాన్యాదులఁ దృప్తిం, గని తమతమపనులయందుఁ ♦ గడు జాగ్రతనుం
గని వరభూషణధరులై, తనరెడు రాజానుచరులఁ ♦ దగ నటఁ గాంచెన్. ౨౩

క. సిరివెలయు లక్ష్మణుఁడు నూ, పురములకూజితము ముదముఁ ♦ బొందించెడు శ్రీ
కరకాంచీనాదంబును, బరిపరి విని [2]లజ్జ నొందెఁ ♦ బ్రాజ్ఞుఁడు కానన్. ౨౪½

క. విని యాభరణస్వనముల, వనచరపతి సౌఖ్యవార్ధిఁ ♦ బరఁగుచు నున్నాఁ
డని యెఱిఁగి రోషవేగం, బున జ్యానినదంబు దెసల ♦ మ్రోగంజేసెన్. ౨౫½

సీ. అమ్మహాబాహుఁ డ♦య్యదనున రామశోకసమన్వితుండయి ♦ కరము శీల
మున నపకృష్టుఁడై ♦ వనితలుండెడుస్థలమునకుఁ బోరాదని ♦ మనమునందుఁ
దలపోసి యేకాంత♦ధరణీస్థలంబున నుండె నంతటఁ గపీం♦ద్రుండు త్వరగ
నాచాపటంకృతి ♦ నరసి లక్ష్మణురాక యెఱిఁగి భీతింగొని ♦ నెఱిఁ దగు తన

1 ఫలమాల్యకృతవ్యగ్రాః-అనిమూ. 2 సౌమిత్రి ర్లజ్జితోఽభవత్-అనిమూ.

తే. యుత్తమాసనమునఁనుండి ♦ తత్తఱిల్లి
చలనముం గాంచె; నంతటఁ ♦ దలఁచె నిట్లు
పూర్వమంగదుఁ డన్నట్టి♦పోల్కి భ్రాతృ
వత్సలుండగుసౌమిత్రి ♦ వచ్చె నిదిగో. ౨౮॥ 1269

క. తలఁపఁగ సువ్యక్తంబిది, కలదే చేయంగఁదగిన♦కార్యం బిఁక ని
మ్ముల నని యనుకొనుచుం గపి,కులపతి యంగదుఁడునుదన♦కుఱమునుముందే.

తే. లక్ష్మణునిరాక వేగతు♦ల సూచింపఁ, దెలిసికొనినదియేగాక ♦ దీప్తచాప
శింజినీనిస్వనంబునఁ ♦ జిత్తమందు, దెలిసికొని నోటఁ దడిలేక ♦ కలఁగె నతఁడు.

చ. హరికులపుంగవుం డయిన♦యర్కతనూజుఁడు భీతిచేతఁ దాం
దరపడుచుం బ్రమాదము ని♦తాంతము వీడి సమీపమందు ను
న్నరమణిఁ దారఁ గాంచి వచ♦నంబు హితంబుగ నొప్పఁబల్కె; నో
సరసిజనేత్ర! లక్ష్మణుని ♦ స్వాంతము నైజమృదుత్వమై తగుఁ. ౩౧॥ 1272

ఉ. కారణమేమొ రోషయుతిఁ ♦ గాంచి యతం డిట వచ్చినాఁడుగా
యారయ నేమితోఁచెడిని ♦ నాత్మకు నీకు: ననిందితాంగి! యీ
శ్రీరఘురాముతమ్మునకుఁ ♦ జిత్తమునందు నకారణంబుగాఁ
జేరదు రోష మేయదన ♦ శ్రేష్ఠుఁడు పూరుషులందు నాతఁడౌ. ౩౨॥ 1278

క. ఏమైన నప్రియంబును, రామానుజుపట్ల నే వి♦రహితజ్ఞుఁడనై
యేమఱి చేసినయట్లే, నీమదికిం దోఁచె నొక్కొ? ♦ నీరజనయనా!. 33 1274

క. దీనిని త్వరపడి నీవే, మానసమున నరసి చెప్పు ♦ మంజులచిత్తా!
వే నీవె పోయి యాతని, మానుగఁ గనుఁగొనుట నిపుడు ♦ మంచిది సుమ్మీ!.

చ. కనుఁగొని సామవాక్యములఁ ♦ గామిని! యాతనిసుప్రసన్నుఁగా
నొనరుపు; నిన్నుఁ జూడఁగనె ♦ యుద్ధతి వీడి ప్రసన్నచిత్తుఁడై
మనమునఁ గోపము న్మఱచు ♦ మానినులందు మహాత్ము లెత్తఱిం
గనరు మహోగ్రహంబు నటు♦గావున వే చనుమా! మదర్థమై. ౩౫॥ 1276

సీ. తొలుదొల్త నీవేగి ♦ యల లక్ష్మణునితోడ సామవాక్యము లాడఁ♦జనును దాని
వలన నాతనిప్రియ♦స్వాంత మింద్రియములు సుప్రసన్నము లగు♦శోభనాంగి
కమలపత్రాక్షుని ♦ క్ష్మాపతిపుత్త్రుని శత్రుహంతను గనఁ♦జాలువాఁడ;
ననిన నాతారయు ♦ నడుగులు రతిపరవశతఁ దొట్రిలుచుండఁ ♦ బానమదము
వలన నేత్రములు వి♦హ్వలములై యొప్పంగఁ గాంచీగుణంబును ♦ గనకసూత్ర

తే. మును గ్రమంబున వ్రేలాడ ♦ మనసిజసుఖ
కేళిచిహ్నము లొప్పంగ ♦ లీల వినమి
తాంగయష్టికయయి రాఘ♦వానుజన్ము
చెంత కరిగెను; భయమునఁ ♦ జిత్తమదర. ౩౬॥ 1277

చ. మనుజపతీంద్రపుత్త్రుఁడయి ♦ మానితచిత్తుఁడు నౌట లక్ష్మణుం
డనుగతభోగచిహ్నముల ♦ నల్లనవచ్చిన వానరేంద్రు భా
ర్యను గని మోమువాంచి యిత♦రాంగన సన్నిధియౌటఁ గోపముం
గొనక, తదీయచిహ్నములఁ ♦ గొంచెమొయైనను జూడ కచ్చటన్. ౩౭½ 1278

తే. తా నుదాసీనుఁడై యుండెఁ; ♦ దరుణి కేళి
చిహ్నములతోడఁ దాను వ♦చ్చియును మద్య
పానమదమున లజ్జను ♦ వదలి యతని
దృష్టితనరాకచేఁ గడుఁ♦దేట యగుట. ౩౯ 1279

చ. మునుమును సాంత్వనోక్తులఁ బ్ర♦మోదము శాంతము నందఁజేయుచున్
ఘనతరమైత్రిచేఁ గడుఁ బ్ర♦గల్భమునై విపులార్థయుక్తమై
కనఁబడుమాట యొప్పఁ బలు♦కం దగఁ బూనె; నరేంద్రపుత్ర! నీ
కు నిపుడు కోపమూనుటకుఁ ♦ గూడినకారణమేదొ తెల్పుమా!. ౪౦½ 1280

క. నీమాట నెవఁడుమీఱెను, దాముందును వెనుకఁగనక ♦ తగ నెవ్వం డు
ద్దామవిశుష్కమహీరుహ, మై మించెడు నడవిలోన ♦ నతితీవ్రముగన్. ౪౧

తే. మండుదావాగ్నికడకు న♦ఖండరీతిఁ
బోవఁగలఁడని పల్కె నా♦పూవుబోడి
*సాంత్వపూర్వముగాఁగ ని♦శ్శంకఁ బ్రణయ
దర్శితార్థంబుగాఁ బల్కె ♦ దాశరథియు. ౪౧½ 1282

క. విని తారఁ జూచి యిట్లను, వనితా! పతిహితమునందె ♦ వర్తిల్లెదుగా
వునఁ బని యిదియని యెఱుఁగవు, వనచరపతి నీదుభర్త ♦ వైభవములరన్.

తే. కామవృత్తంబునందు ని♦కామమెలమి
తనరఁగా లుప్తధర్మార్థ♦తతియయి యిపు
డున్నవాఁ డిద్ది తెలియక ♦ యున్నదాన
వేమొ? తారా! భవత్పతి ♦ యించుకేని. ౪౨½ 1284

క. తలపోయఁడు రాజ్యార్థం,బుల దుఃఖపరాయణత్వ♦మునఁ గుందు మమున్
గలనైనం దలపోయం, డెలమిన్ సామాత్యుఁడగుచు ♦ నెల్లప్పుడు తాన్. ౪౩

క. తనబంధుజనంబులతో, మనమలరఁగఁ బానమునె స♦మస్తవిధములం
దనకుం బరమార్థదమా, నని సేవించుచుఁ జెలంగు ♦ నతిగర్వమునన్. ౪౩½

చ. వనచరనాయకుండు గరు♦వంబున జానకిఁ జూడనంపు న
ప్పనికయి నాల్గుమాసములు ♦ పంతముమీఱఁ బ్రతిజ్ఞసేసి యొ
య్యన నవి దాఁటిపోయినను ♦ నాత్మ నెఱుంగకయున్నవాఁడు నూ;
వనితరో! యర్థధర్మముల♦పద్ధతి సిద్ధిని గోరియున్నచోన్. ౪౪½ 1287

* మహార్థం పరిసాంత్వపూర్వమ్-అనిమూలము.

ఆ. ఇట్లు మద్యపాన ♦ మెలమిఁ జేయుచునుంట, మెచ్చఁదగదు దాన ♦ మిగుల నర్థ
ధర్మకామములును ♦ దమయంత నెనశించుఁ;, దనకు నెవ్వఁడుపకృ ♦ తినినొనర్చు.

క. వానికిఁ బ్రత్యుపకారము, మానక చేయుటను దాను ♦ మానినచోఁ బెం
పూనినధర్మమునకుఁ గడుఁ, గాననగుఁ లోప మవనిఁ ♦ గాంతామణిరో! ౪౬

[1]సీ. ప్రత్యుపకారము ♦ పరమధర్మంబగు టరయక తాను జే ♦ యనియెడలను
గుణవంతుఁడగునట్టి ♦ కూరిమిమిత్రుండు నశియించినప్పుడు ♦ నారి! మిగుల
నర్థకామంబులు ♦ నల్లన లోపించు ధర్మంబునందు స ♦ త్యంబునందు
స్థిరనిష్ఠ గలిగిన ♦ చెలికాఁడు ధర్మార్థములకు మూలంబయి ♦ యలరుచుంట

తే. వానికంటెను నెక్కుడౌఁ ♦ గాననట్టి, సఖుని విడనాడినాఁడు కీ ♦ శపతిగాన
నితని కర్థంబు కామంబు ♦ నిట్లె ధర్మ,మును నశించును నిక్కమో ♦ వనజనయన!.

తే. కార్యతత్త్వజ్ఞురాలవు ♦ గాన నీవు
ప్రకృతకార్యంబునందు నె ♦ ప్పుగిది మేము
చేయవలయునొ యేపనిఁ ♦ జెప్పనేర్తు
వీవ తలపోసి చెప్పుమా! ♦ యింకమీఁద. ౪౭ 1291

మ. అని ధర్మార్థయుతంబు నైజముగనే ♦ యత్యంతమాధుర్యముం
గన న్యాయంబునునైన లక్ష్మణునివా ♦ క్యం బట్టి యాలించి త
మ్ముని రాముం డనుషంగ హేతువును వే ♦ బుద్ధిస్థిరత్వంబునం
గని విశ్వాసము పుట్టునట్లు పలికెం ♦ గాంతోక్తి సౌమిత్రితోఁ. ౪౮ 1292

క. భూపకుమారా! వీరా!, నాపతి కామార్తుఁడయి మ ♦ నస్థైర్యంబుఁ
జూపట్టమి నుండుటచేఁ, గోపం బూనంగ నిపుడు ♦ గూడదు నీకుఁ. ౫౦

క. అతికోపము స్వజనునియం, దితరునిపై నెట్టులట్టు ♦ లివు డుంపఁగనె
ట్లు తగుఁ?; మఱియును నాపతి, సతతము మీకార్యములనె ♦ సాధింపంగఁ.

క. మనమున నాసక్తుండై, కనుఁగొనుచున్నాఁడు దాని ♦ క్రమముల నొగిఁ గా
వునఁ గామవశుండయి యు,న్న నా ప్రమాదముల నోర్వ ♦ న్యాయము మీకుఁ.

[2]సీ. వినుము రాజకుమార! ♦ వీర్యాదిగుణముల మిన్నయై తగువాఁడు ♦ మిగులహీన
సత్వుఁడౌ వానిపై ♦ సాధ్వసం బూనఁగూర్చు కోపంబుఁ బొందఁద ♦ గు నెతలంప
సత్త్వావరుద్ధుఁడై ♦ శాంతియుఁ దపమున కాకరంబైన మ ♦ హాపురుషుఁడు
నీవంటివాఁడు కో ♦ పావేశవశుఁడగు నెవ్వఁడు "నారోష ♦ మే యెఱింగి

ఆ. దాని నాప నీవు ♦ పూనితివే కాని, యయ్యమర్షమునకు ♦ నాకరంబు
లైనకారణముల ♦ నరయవుగా మది, ననకు" భూరిసత్వ! ♦ యార్యవర్య!. ౫౧

1 అప్రతికుర్వతః, అర్థలోపశ్చ మిత్రస్య నాశే గుణవతో మహాన్, మిత్రం హ్యర్థగుణ
శ్రేష్ఠం సత్యధర్మపరాయణమ్, తద్ద్వయంతు పరిత్యక్తం నతు ధర్మే వ్యవస్థితమ్.అనియూ. దీనియర్థమే
ఇట వివృతమని యెఱుంగునది. 2 మూలార్థము వ్యాఖ్యానాభిప్రాయముతో నిట వివృతము.

చ. హరికులపుంగవుండయిన ♦ యర్కతనూజున కెంతో మిత్రుఁడై
పరఁగు రఘుక్షితీశు మదిఁ ♦ బర్విన కోపము తత్స్వరూపముం
బరిపరి నేనెఱుంగుదును ♦ వానరనాథుఁడు సీతజాడ నె
క్కరణినినైనఁ గన్గొనఁగఁ ♦ గల్గిన కోఁతులఁ బంపకీగతిన్. ౫౨ 1297

తే. వ్యర్థముగఁ బుచ్చెఁ గాలంబు ♦ నందువలనఁ
గల్గెఁ గోపమటంచుఁ ద♦త్కారణంబు
నెఱుఁగుదును; నీవు మాకుగా ♦ నేమహోప
కృతిని గావించినాఁడవో ♦ యే నెఱుఁగుదు. ౫౨౪ 1298

క. దానికిఁ బ్రతికృతిగా నే, మే నొనరింపంగఁదగునొ ♦ యెఱుఁగుదు దానిన్
మానవతిలకా! వినుమా!, మేనం బుట్టుచుఁ దగంగ ♦ మించుచుఁ గడఁకన్.

చ. తనరెడు కామవేదనకుఁ ♦ దాళఁగ రామియు నేనెఱుంగుదున్
మనసిజునార్తిచేతఁ గపి♦మండనుఁ డిప్పుడు సర్వకాల మే
వనితలఁ గూడియుండెడినొ ♦ వారినెఱుంగుదు; 'నీవు కోపముం
గనుటను జూడ మావలెనె ♦ కామవిహారములందు జ్ఞానముం
డినయటు తోఁపలేదు మది ♦ నీకు మహాత్మక! యాలకింపుమా'!. ౫౮ 1300

సీ. కామతంత్రజ్ఞాన♦కలితుఁడవైనచో ద్వేషించియుండవ వీ♦తిరున ధరఁ
గామలోలునకును ♦ గాలము దేశము ధర్మార్థములు లే వ♦తండు వానిఁ
గనఁడు సుమా! శత్రు♦గణకాలరూప! నాచెంతనె యుండుచుఁ ♦ జిత్తమందుఁ
గామవృత్తంబునె ♦ కాంచుచు దానిచే సిగ్గన లేక ని♦శ్చింతనున్న

తే. నీసహోదరుఁ గపిరాజు ♦ నెమ్మి మీఱ
సైపుమా! ధర్మతపసులఁ ♦ జాల నాచ
రించు పరమర్షులే కామ♦సంచలితహృ
దయులునై కామినుల నెప్డు ♦ దగిలియుంద్రు. ౫౬ 1301

క. ఎపుడును నైజంబుగనే, చపలుండయి రాజునయిన ♦ సప్తాశ్వసుతుం
డపరిమితకామవృత్త, వ్యపగతచిత్తుఁడగుటేమి ♦ యాశ్చర్యమిఁకన్. ౫౬౪

చ. అని యిటు లప్రమేయుఁడగు ♦ నాతనితోడ మహార్థమైనవా
క్యనిచయ మాడి వే మరల ♦ క్ష్మాపతిపుత్రునిఁ గాంచి లీలఁగా
ననియెను; బానగర్వమున ♦ నంగముఁ దూలఁగ భర్తకున్ హితం
బును గలిగించునట్లు నర♦పుంగవ! సూర్యసుతుండు పూనికన్. ౫౭౪ 1303

తే. కామపరతంత్రుఁడయ్యు మీ♦కార్యసాధ
నవిషయంబున సత్ప్రియ♦త్నమును మున్నె

---

న కామతంత్రే తవబుద్ధి రస్తి త్వం వై యథా మన్యువశం ప్రపన్నః-అనియా.

చేసి వానరులకు నాజ్ఞ ♦ చేసినాఁడు
పటుపరాక్రమశాలురౌ ♦ ప్లవగవరులు. ౫౯ 1304

తే. కామరూపులు నానాన♦గనివసతులు, నియుతకోటుల సంఖ్యల ♦ నెమ్మిమీఱ
వచ్చియున్నారు; లోపలి ♦ కిచ్చరమ్ము, రాణివాసమునకుఁ బోవ♦రాదటంచు.

చ. మనమున నెన్ని శీలమును ♦ మన్ననమీఱఁగఁ గాచుకొంచు మీ
యనుపమసాధువర్తనము ♦ నంతయుఁ దెల్పితి రిద్ది న్యాయమై
నను మనకున్నసఖ్యము మ♦నంబున నెన్నుచు మిత్రదారలం
గనుట యఘంబుగా దనుట ♦ గాదిలిప్రేమఁ దలంపుమా! విభూ!. ౬౦౧ 1306

క. అనియె నరిందముఁడగు నా, ఘనభుజుఁ డాలక్ష్మణుండు ♦ కాంతామణి ర
మ్మని పిలుచుట శ్రీరాముని,పని త్వరపెట్టుటను బోయెఁ ♦ బ్రమదం బలరన్.

చ. చని యటఁ దప్తభర్మమయ♦చారువరాస్తరణాభిశోభితా
సనమునఁ గూరుచుండి తగఁ ♦ జండమరీచునిఁ బోలియున్నయ
వ్వనచరునాథుఁ గాంచె; నవ♦భవ్యవరాభరణంబు లొప్ప న
త్యనుపమరత్నచిత్రితసు♦హాంగదముల్ పొలుపారుచుండఁగన్. ౬౩ 1308

చ. అరుదగురూపమొప్ప నతఁ ♦ డాయతకీర్తియుఁ జెన్నుమీఱ నం
బరములు మాల్యముల్ రుచిర♦ఛాయుతి నెంతయు వెల్గుచుండ ని
ర్జరపతివోలె దుర్జయుఁడు ♦ చారుతరాభరణాళిమాల్యవి
స్ఫురదసమానగాత్రలయి ♦ శోభిలు స్త్రీతతి సంయుతుండునై
పరఁగుచు నుండఁ గాంచె, రఘు♦వర్యసహోదరుఁ డంత నాతనిన్. ౬౪ 1309

క. వనితాసంగతి నుండిన, వనచరపతిఁ గాంచి కోప♦భరమున మిగులం
గను లెఱ్ఱఁబాఱఁగా ధ,ర్మునిబోలి భయంకరస్వ♦రూపుం డయ్యెన్. ౬౪౧

చ. నిరుపమహేమవర్ణుఁడయి ♦ నెమ్మి రుమం దగఁ గౌఁగిలించుకొం
చరుదయి దివ్యమైన పరి♦మాసనముం దుపవిష్టుఁడై మనో
హరసువిశాలనేత్రుఁడయి ♦ యీరవిపుత్రకుఁ డాయతాత్ముఁడై
పరఁగు రఘూత్తమానుజుని ♦ బాణశరాసనహస్తుఁ గాంచెఁ దాన్. ౬౫౧

ముప్పదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౩౪ - వ సర్గము.

లక్ష్మణుఁడు సుగ్రీవునకు రాము నానతి నెఱింగించుట.

ఆ. అంతిపురముఁ జొచ్చి ♦ యప్రతిహతగతి, వచ్చియున్న పురుష♦వర్యు రాము
ననుజుఁ గాంచి వనచ♦రాధీశుఁ డెంతయు, వ్యథితచిత్తుఁడయ్యె ♦ నంతలోన. ౧

సీ. అన్నకుఁ గలిగిన ♦ యధికవ్యసనమునఁ బరితపించుచుఁ గోప♦పరవశుఁడయి
*నిశ్శ్వసమానుఁడై ♦ నిజతేజమునఁ బ్రజ్వలించెడులక్ష్మణుఁ ♦ గాంచి యప్డు

---

* క్రుద్ధం నిశ్వసమానంతం-అనిమూలము.

సుగ్రీవుఁ డెంతయుఁ ♦ శోభిల్లు కనకాసనమునుండి యురికి యిం♦ద్రధ్వజంబు
వలె నిలుచుండె; న♦భంబున సంపూర్ణశశి యుదయింప న♦క్షత్రగణము

తే. లతనివెంటనె యుదయించు♦నట్లు లినజుఁ
డాసనమునుండి లేవఁగ ♦ నతనివెంట
రుమయు మొదలుగఁ గల్గు భీ♦రువులు లేచి;
రంత మధుపానమదమున ♦ నర్కజుండు. ౪ 1313

క. కనులెఱ్ఱఁబాఱ సంపద, తనరారఁ గృతాంజలియయి ♦ దాశరథి నెదు
ర్కొని గురుకల్పద్రుమభం,గిని నిలుచుండెను మనంబు ♦ కీడ్పడుచుండన్. ౫

క. వనితాసమూహమధ్యసు,మున రుమతోఁ గూడి భగణ♦ముల యంతరమం
దున నున్నచంద్రువలె నొ,ప్పిన సుగ్రీవుఁ గని యంతఁ ♦ బెనుకోపమునన్. ౬

క. పలికెన్ లక్ష్మణుఁ డిట్లని, బలవంతుఁడు సత్కులమునఁ ♦ బ్రభవిల్లి మహా
ర్తులయెడఁ గరుణఁజెలంగఁగ,నలరుచు విజితేంద్రియుండు♦నయి కృతవిదుఁడై. ౭

క. ఋతవచనుండయి పొల్చెడు, క్షితిపతి పూజ్యుండు సుమ్ము ♦ స్థిరపై నేభూ
పతి ధర్మేతరమార్గ,స్థితుఁడై యుపకర్తలైన ♦ చెలికాండ్రకుగాన్. ౮ 1317

క. అనృతప్రతిజ్ఞ సేయునొ, మనుజేంద్రుని కతని కన్న ♦మఱి పాపిష్ఠుం
డనఁదగినవాఁడు మేదిని, గనరాఁ డొకరుణ్ణమునకుఁ♦గా నెవఁడైనన్. ౯ 1318

చ. అనృతము పల్కనేని యతఁ ♦ డశ్వశతంబు వధింపఁగల్గు నా
ఘనతరదోష మొందును నిఁ♦కన్ ధర గోవిషయంబునందు నే
మనుజుఁ డసత్యమాడునొ క్ర♦మంబున ధేనుసహస్రము న్వధిం
చినయఘ మొందు, నేనరుఁడు ♦ చిత్తమునందుఁ దలంప కొయ్యనన్. ౧౦

క. నరువిషయంబున ననృతము, పరఁగించునొ యాత్మహత్య ♦ స్వజనహననముల్
నిరతిం జేసినపాపము, నరుఁడాతఁడు గాంచు; రాము♦నకు సుగ్రీవా!. ౧౧ 1320

క. అనృతప్రతిజ్ఞ సేసినఁ, గననౌ పానమును జెప్పఁ♦గాఁ దరమానే;
వనచరనాథా! మును తన, పని నొనరించుకొని మిత్ర♦పటలికి మరలన్. ౧౨

తే. మాటచొప్పున వారిన♦స్మృతముఁ దీర్ప
కుండునో యట్టిమనుజుఁడె ♦ యుర్విలోఁ గృ
తఘ్నుఁ డనఁబడు సర్వభూ♦తములు వానిఁ
జంపఁగావచ్చు దోషలే♦శంబు లేదు. ౧౩ 1322

క. మును స్వాయంభువమను వో, వనచరనాథా! కృతఘ్ను♦వారక కని లో
కనిచయపూజిత మగుచుం, దనరెడు నీశ్లోకమును గ్ర♦ధం బఠియించెన్. ౧౪

*సీ. వినుము పఠించెద ♦ మనువు జెప్పినశ్లోకమును నేను; "బ్రహ్మహ♦త్య నొనరించి
నట్టివానికిని, మ♦ద్యంబుఁ ద్రాగినవాని కట్లె స్వర్ణంబును ♦ నపహరించి

* శ్లోకార్థ మీసీసపద్యమున విస్తృతమని యెఱుఁగవలయును.

తరువులను మనోజ్ఞ♦తమపుష్పయుక్తము,లను జెలంగు కొండ♦లను గనుండు.

సీ. అఱువదివేలసం♦ఖ్యల నొప్పు నయ్యవి; వానియంతరమునఁ ♦ బర్వతవర
మయిన సావర్ణిమే♦ర్వాహ్వయపర్వత మలరారు మును సూర్యుఁ♦డాదరమున
దానికి వరమిచ్చి ♦ తగనిట్లు పల్కెఁ; నాకరుణచే నీయందుఁ ♦ గల సమస్త
తరుశిలాదులు సదా♦తపనీయమయములై యలరును నీయందు♦లలి వసించు

తే. దేవగంధర్వదానవుల్ ♦ దివ్యరుచుల
రక్తవర్ణులుగా నయి ♦ రమ్యభర్మ
కళల నొప్పారుచుండఁగాఁ ♦ గలరు; సతత
మనుచు వరమిచ్చె; నాశైల♦మునను జేరి. ౪౦ 1587

క. అనిలులు విశ్వేదేవత,లును వసువష్టకము నమరు♦లున్ దగ సాయం
తనమున నప్పర్వతవర,మున రవిఁ గాంచుచును వారు ♦ మ్రొక్కుదు రెలమిన్.

క. హరిదశ్వుఁడు తత్పూజల, వరుసం గైకొనుచు నస్త♦పర్వతమునకున్
ద్వరఁ జని భూతాళికనో,చరుఁడగు; సావర్ణిమేరు♦శైలమ్మునకున్. ౪౨ 1589

తే. అస్తగిరికిని నంతర ♦ మరయఁగ దశ
యోజనములుండు నద్దాని ♦ నొక్కగడియ
కాలమున దాఁటి భానుండు ♦ కడు రయమున
నస్తశిఖరంబుఁ జేరు; న♦య్యద్రియందు. ౪౩ 1590

క. కలదొండు శిఖరమందుం, గల దద్దానిపయి విశ్వ♦కర్మరచితమై
జలజాతమిత్రసన్నిభ,ము లలితమును నైన భవన♦ము మహితమగుచున్. ౪౪

క. దానికిఁ జుట్టును సౌధవి, తానము చెలువారు; బహువి♦ధపత్త్రులచేఁ
గానఁబడుతరువరము ల, ద్దానికి నలుప్రక్కలను ని♦తాంతం బలరున్. ౪౫

చ. వినుఁడది పాశహస్తుఁడయి ♦ విశ్రుతకీర్తియునైన పాశి యుం
డు నిలయ; మస్తశైలము గ♦డుం బొలుపారెడు మేరుభూధ్రముం
గనియెడు మధ్యభాగమునఁ ♦ గర్బురరూపముగాఁ జెలంగుచున్
గన దశకూటయుక్తమయి ♦ క్రాలుచు భవ్యసువేదికావృతం
బును నగు తాళవృక్ష మటఁ ♦ బొల్చును దర్శనయోగ్యమై తగన్. ౪౬ 1593

తే. ధర్మవేత్తయు స్వతపఃప్ర♦భావపూజి
తుఁడు శతానందునకు సమా♦నుఁడునునైన
మేరుసావర్ణి యనుపేర ♦ మించునాతఁ
డలరు సావర్ణిమేరుమ♦హాద్రియందు. ౪౭ 1594

క. అందుఁగల దుర్గమస్థలు, లందున్ సరసులను నదుల♦యందును మీరల్
పొందుగ జానకినిన్ వెద,కందగు రావణుని శ్రద్ధ♦గా శౌర్యములన్. ౪౮

చ. ఖరకరురీతిఁగా మిగులఁ ♦ గ్రాలెడు నామునికెంతొ భక్తి మీ
శిరములు నేలసోఁక హిత♦సిద్ధిని గోరుచు మ్రొక్కి జానకీ
తరుణి ప్రవృత్తినెల్లను ని♦తాంతము ప్రశ్నమొనర్పఁ డాదివా
కరుఁడు త్రియామమపోయిన జ♦గంబునఁ గన్పడి స్వప్రభావళిన్. ౪౯ 1596

ఆ. ఉదయపర్వతంబు ♦ మొదలుగ నస్తాద్రి, వఱకుఁ గలుగుభూమి♦భాగమందు
నంధకారమణఁచి ♦ యస్తాద్రినిం జేరు;, వనచరేంద్రులార! ♦ వినుఁడు మీరు.

తే. నేను జెప్పినదనుకనే ♦ వానరులకు
నరుగ శక్యము మీఁదటి♦యవని రవియుఁ
గానరామిని జీకట్లు ♦ గ్రమ్మి యేమి
తెలియకుంటను *మాకును ♦ దెలియ దవల. ౫౧ 1598

చ. ఖరకరుఁ డస్తమించు గిరి♦కాంతుని దాఁకను బోయి మీర లా
సురరిపుఁ డున్నతావు రఘు♦శూరునిపత్ని వసించుచోటు వే
యరయుచు నొక్కమాసమున ♦ కందఱు చేరుఁడు వచ్చియిందు; నె
వ్వరుసను హద్దుదాఁటకుఁడు ♦ వధ్యుఁడె యానటు దాఁటునేనియున్. ౫౨

క. నామాట యీనుషేణుఁడు, తామహి శూరుండు మిమ్ముఁ ♦ దమిఁగూడియొ శ్రీ
రాముని పత్నిని వెదకం, గా మైకొనె రాఁగ మీరు ♦ కడుయత్నమునన్. ౫౩

క. అతఁడు వచించినపనులన్, హితములెయని యాలకించి ♦ యెల్లరు విని యా
గతివర్తింపుఁడు గురుభుజుఁ, డితఁడు గురుండగును శ్వశురుఁ ♦ డిద్ధబలుఁడునౌ.

క. మీరును సంగరములలో, శూరులు కార్యంబు లిట్టి♦చొప్పునఁ జేయం
గా రహిఁ దనరు నటంచని, ధీరతనియమంబుఁ జేయు ♦ ధీయుతులుగదా.

ఆ నియమ మిట్లుచేసి ♦ నిశ్చయచిత్తంబులను బడనుర మీరు ♦ జనకతనయ
దనుజు వెదకవలయు; ♦ దారుణతేజుఁడౌ, రాముసుదతి సుగుణ♦రమ్య సీత.

క. కనియే వచ్చిన రాముఁడు, మనకొనరిచినట్టి మేలు ♦ నుఱువక ప్రతిఁజే
సినవారము కృతకృత్యుల, మును నగుదుము వేయిపచన♦ముల నింకేలా!.

సీ. నేను జెప్పినదె కా♦కీనిమిత్తంబయి యేకార్యమేనియు ♦ హితము గల్గె
నేని దానినిగూడఁ ♦ బూనిక దేశకాలార్థముల్ యోజించి ♦ యాచరింపుఁ;
డెన్నిచందములనే ♦ నిల గన్నపుత్రిని గనఁనగునని పల్కి ♦ విని కపీంద్రు
నిపుణవాక్యంబులఁ ♦ గపులు సుషేణాదు లాతనియాజ్ఞల ♦ నాదరించి

ఆ. యతనిసెలవునొంది ♦ యతిజవమున వరు,ణాభిపాలితముగు♦నట్టి దెసకుఁ
జనిరి జనకపుత్రిఁ ♦ గని వచ్చుకోరిక, లాత్మలందుఁ బొదల ♦ నతిజవమున. ౫౮

నలువదిరెండవ సర్గము సంపూర్ణము.

---

* నజానీమ స్తతఃపరమ్-అనిమూ.

## ౪౩ - వ సర్గము.

శతబలి మొదలగువానరుల నుత్తరమునకుఁ బంపుట

చ. వనచరసత్తముండు శ్రుతి♦వర్ణితధర్మవిదుండు నౌ దిసే
శునితనయుండు మానసుఁడు ♦ శూరుఁ సుషేణునిఁ బశ్చిమాశకుం
బనిపి కపీశు వీరు గురు♦బాహుబలాఢ్యుని రామభక్తిచి
త్తుని స్వహితంబు రామనృప♦తోయజనైరిహితంబుగా వచిం
చెను; విను లక్షవానరులఁ ♦ జేకొని త్వాకృశులగ జవంబునన్. ౨౪ 1606

[1] తే. శతబలీ! యముపుత్త్రులౌ ♦ సచివవరుల
వీరలంగూడి పయనంబు ♦ వేగచేయు
ముత్తరపుదెస కయ్యది ♦ యున్నతిఁగని
హిమగిరీంద్రముచే వలం♦కృతము నగుచు. ౩౪ 1607

క. తనరారుఁగాన నచటికిఁ, జని సీత ననిందితాంగిఁ ♦ జక్కఁగ వెదకం
జను; మీరు కార్యవేత్తల,కును మేటులు గానఁ జనుట♦కుం బూని తమిన్.

క. చనినం జక్కఁగ నీపని, యనూనగతి సఫలమగుచు ♦ నలరినచో సీ
తను దెచ్చి రామునకు నిచ్చినచో ఋణముక్తిఁ గాంచి♦చెందుదుము తమిన్.

క. కృతకృత్యులమును నగుదుము;,హితకృత్యము మనకు రాముఁ♦డేయొనరిచె ము
న్నతనికిఁ బ్రత్యుపకారముఁ, [2]గృతహితము నెఱింగిచేయ♦నిపుడొదవినచోన్.

క. మనజీవితంబు సఫలము;, మనుజుం డుపకృతి నదేమి ♦ మనకొనరుప కు
న్నను ముందుపకృతిఁ జేయం,గను గోరినయెడల నట్టి♦ఘనునకుపకృతిన్. ౬౪

చ. ఒనరుచు నెన్నఁడట్టి మహి♦మోన్నతు జన్మము సార్థకంబు నాఁ
గ నిఁక మహోపకారియును ♦ గానకే యొనరించువాని కిం
కను నొనరించునట్టి యుప♦కారము సత్పులవంబటంచుఁ జె
ప్పనువలెనే? మదీయహిత♦భావము గల్గినవారు గావునన్. ౭ 1612

సీ. ప్రత్యుపకృతిసేయ♦వలయునన్న సుబుద్ధి నూని మీరలు జన♦కోర్వినాథు
తనయఁ గాంచెదునట్టి ♦ ఘనతరయత్నంబుఁ జేయుఁడు మానవ♦సింహుఁడఖిల
భూతైకపూజ్యుండు♦ప్రీతియు మనయందుఁగలవాఁడు రిపుపురం♦బులజయించు
వాఁడునౌ రఘుకుల♦వర్యుఁ డీతఁడు కాన సీతనికృత్యమే ♦ యిపుడు చేయ

తే. వలయు; నీనదదుర్గమ♦స్థలుల నదులఁ, బర్వతంబుల మీబుద్ధి♦బలము మెఱయ
వెదకి జానకిజాడను ♦ వేగ యెఱింగి, రండు నాయిష్టసిద్ధిఁ జే♦యుండు పూన్కి.

---

1 వైవస్వతసుతైః సార్ధం ప్రతిష్ఠస్వ స్వమంత్రిభిః-అనిమూలము 2 కృతం హి ప్రియ ముస్మాకమ్-అనిమూలము.

సీ. ఉత్తరదిక్కునం♦దొప్పు మ్లేచ్ఛుల దేశములు, పులిందాహ్వయం♦బులును శూర
సేన దేశంబులు ♦ మాననీయములగు [1]ప్రస్థల దేశముల్ ♦ భరత దేశ
ములు,యామ్యకురు దేశ♦ములు,మద్ర దేశముల్ కాంభోజయవన,శ♦కజనపదము
లారట్ట బాహ్లీక♦పౌరవ దేశముల్ చక్కనిబుషిక దే♦శములు టంక
తే. ణములు, [2]చీన,విహార దే♦శములు పరమ
చీన దేశంబులును మఱి ♦ చిత్రములగు
దరద దేశమ్ములును గల ♦ వరసి యందు
హిమగిరీంద్రంబునకు మీర♦లేగి యచట. ౧౩ 1614
క. జనకజఁ జక్కఁగ వెదకుఁడు, కనుఁగొననగు లోధ్ర భూజ♦గణయుతమై పొ
ల్చినవనములఁ బద్మకముల, ఘనమ్ములగు దేవదారు♦కాననములనున్. ౧౪
క. తిరుగుచు సీతను రావణు, నరయుఁడు; గంధర్వు లమరు ♦ లర్చించెడు భా
సురసోమాశ్రమసీమకు, నరుగుఁడు తర్వాత మీర ♦ లందుండి వెసన్. ౧౫
క. ఘనసానుయుక్తకాళం, బనుపర్వతమునకు నేగుఁ ♦ డా కాళాద్రిన్
గనుపట్టు కోనలన్ గుహ,లను జక్కఁగ వెదకవలయు ♦ ల లనానుఁశినిన్. ౧౬
క. కనకనిధిప్రతిభాసుర,మును భూరితరంబునగుచుఁ ♦ బొల్చెడు కాళా
ద్రిని దాఁటి సుదర్శన మనఁ,గ నొప్పు భూధరముఁ గాంచఁ♦గాఁ దగు నంతన్.
క నిరతము పతగాలయమై, పరఁగెడు దేవసఖమనెడు ♦ పర్వత మదియున్
వరతరుభూషితమయి సుం,దరపక్షిగణావృతమయి ♦ తనరుం జుండీ!. ౧౮
ఆ. దాని కాననముల ♦ దరుల నిర్ఝరముల, జనకతనయ దనుజుఁ ♦ జక్క వెదకి
దానిగడచి యట శ♦తనమయోజనములు, [3]విరివిగలిగి శూన్య♦వృత్తియగుచు.
క. కనఁబడు నొకభూభాగము, కనరావటఁ బర్వతములు♦గాని నదులు వృ
క్షనికరములుగాని గనుం,గొనఁబడ వేజంతువులును ♦ క్షోణిని నచటన్. ౨౦
చ. కనుఁగొన రోమహర్షణము♦గా భయదంబుగ నొప్పునట్టి య
వ్వనమును వేగ దాఁటి చని ♦ పాండురమై యలరారువెండికొం
డను గనినంత సంతస మ♦నంతముగాఁ గలుగంగ నొప్పు; దా
ననలరు యక్షరాజభవ♦నంబు సితాభ్రమురీతిఁ జక్కనై. ౨౧ 1622
చ. కనకపరిష్కృతంబగుచుఁ ♦ గ్రాలుచు దివ్యముగాఁగ విశ్వక
ర్మనిరతిఁ జేయ నొప్పి మహి♦మంబునఁ జెన్నగు; నందుఁ గల్వలున్
వనజములుం జెలంగ నతి♦వైభవమొప్ప సరస్సు గన్పడున్
గనుఁగొన సంతసం బిడుచుఁ ♦ గాంక్షితదానచణంబునై తగన్. ౨౨ 1623
చ. అదియె మానస మనెడు నా♦హ్వయము చేతఁ
బరఁగు నంచలుఁ గారండ♦వములు నందు

1 ప్రస్థలాన్ భరతాం శ్చైన-అనిమూలము. 2 చీనాన్ పరమచీనాం శ్చ - అనిమూలము.
3 సర్వసత్త్వవివర్జితమ్-అనిమూలము.

నిండియుండును ద్రిదశుల♦నెలఁతలెల్లఁ
గుంపులుగఁ గూడి యద్దానిఁ ♦ గొల్చుచుంద్రు. ౨౩ 1624

తే. అట్టికైలాసమందు శ్రీ ♦ యలరుచుండ
విశ్రవణునకుఁ బుత్రుఁడై ♦ వెలసి సర్వ
భూతవందితుఁడై యక్ష♦పూగపతియు
నైన ధనదుఁడు పొల్చు వి♦హారకలన. ౨४ 1625

క. ఆకైలాసంబున శశి, నీకాశప్రాంతశైల♦నికరంబులలోఁ
బ్రాకటకందరములలో, భూకన్యను రావణునిని ♦ బోలుగ వెదకగ. ౨౫ 1626

క. తరువాతఁ గ్రౌంచనగమున, కరిగి యటుల గుహుఁడు శక్తి ♦ నలరించినభీ
కరదుర్గమబిలమందుం, బరాకు లేకుండఁ బోవ♦వలయుం జుండీ. ౨౬ 1627

క. వనచరులారా! యాబిలమును జొచ్చుట కష్టతరము ♦ మునులందుఁ గనుం
గొనఁబడుదురు రవితేజులు, ఘనమతులును *దేవసంఘ♦కల్పితపూజ్యుల్.

క. సురరూపులు వార లటుల, నిరతము నివసించువారు; ♦ నిర్జరసంఘా
దరణార్హమైన యాగిరిఁ, బరికించుచు నితరగుహాల ♦ వరసానువులన్. ౨౮

తే. శిఖరములయందుఁ గోనల♦చెంత మఱి ని
తంబములయందు నయ్యాయి♦స్థలములందు
జనకజను మీరు వెదకంగఁ ♦ జనును; క్రౌంచ
మందు ముఖ్యశిఖరమును ♦ నరసి యవల. ౨౯ 1630

సీ. తరురహితంబుగాఁ ♦ దనరు కామాద్రిని బతగాలయంబయి ♦ పరిఘవిల్లు
మానసాద్రిని జూడఁ♦గానగు నద్ది సామాన్యులై తగునట్టి ♦ మానవులకె
కాక, యమర్త్యరా♦క్షసులకు దానవులకుఁ గూడఁ జొరరాక ♦ సకలజంతు
భయదంబుగానుండు ♦ భవ్యసాన్వాదికస్థలములయందెల్ల ♦ జనకతనయ

తే. వెదకుఁ డద్దాని మీఱిన♦పిదప నందుఁ
గానవొను మైనాకంబు ♦ దానియందు
మయుఁడు తనకొక్క దివ్యమౌ ♦ మందిరంబు
దాన నిర్మించుకొనియుండుఁ ♦ దత్ప్రమతి. ३० 1631

ఆ. దానికందరములు ♦ సానుసితంబాది,కములయందు ఘోట♦కముఖములను
దనరు ప్రమదలుండు♦స్థలములఁ జక్కఁగాఁ,దిరిగి వెదకవలయు ♦ ధరణితనయ.

క. చనినంత దానిమీఱుచుఁ, గనఁబడు నాశ్రమము సిద్ధ♦సంఘాశ్రయమం
దును వైఖానసు లనఁబడు, మునులును వాల్యఖిల్య♦మునులును సతముల్.

ఆ. అలరుచుందురు సిద్ధులై; ♦ యస్మహాత్ము
లాత్మతపమునఁ బాపాళి ♦ నణఁచి సఫల

* దేవై రప్యర్చితా స్సమ్య గ్దేవరూపా మహర్షయః-అనిమూలము.

నియతులై యుందురు గావున ♦ నెమ్మి మీరు
మ్రొక్కి వినయంబునన్ వారి ♦ మ్రోల నిలిచి. ౩౪ 1634

క. జనకజదగువృత్తాంతం,బును దప్పక యడుగవలయు; ♦ భూరిమయములౌ
వనజంబుల నలరుచు నిం,పును గూర్చు సరస్సొకండు ♦ పొదలును ఘనమై.

క. తరుణార్కనిభములై శుభ,చరణంబుల నొప్పు హంస ♦ సంచయములు నా
సరసునఁ దగు వైఖానస,సరస్సు నా నద్ది ధాత్రి ♦ జనునుతిఁ గాంచున్. ౩౫

క. నరవాహనుఁడంతింద్రము, కరేణుగణమెల్లఁ గొలువఁ ♦ గాఁ దమితో నా
సరసునను సార్వభౌమ,స్ఫురదుగువిఖ్యాతినంది ♦ సొంపుగఁ దిరుగున్. ౩౬

సీ. దానికవ్వలఁ జంద్ర ♦ తరణుల సంచార మఖిలర్క్ష చారంబు ♦ నందకుండ
నలరు నాకాశమం ♦ దభ్రముల్ తిరుగవు నిశ్శబ్దమై యది ♦ నెగడుచుండు
సిద్ధతపస్కులై ♦ యిద్ధతేజస్కులై యమరసమానులై ♦ యలరు మాను
లట వసింతురుగాన ♦ నవ్వారితనుకాంతులను భానుకిరణంబు ♦ లనువలెఁ బ్రభ
ఆ. వెలయుచుండు; నట్టి ♦ విషమప్రదేశంబు, దాఁటి చనిన నవలి ♦ స్థలమునందు
జాను మీఱుచుండు ♦ శైలోదమనునది, దానిమానితద్వి ♦ తటమునందు. ౩౭

క. తనరుం గీచకవేణువు, లనయంబుఁ బరస్పర మవి ♦ యంటుకొనుచుఁ జ
క్కనివయి దట్టంబుగనుం,డును గావున సిద్ధులుం గ ♦ డుం బూనికతోన్. ౩౮

తే. వానిమీఁదుగఁ బోవుచు ♦ వచ్చుచుండు
దురు; పవిత్రమనస్కుల ♦ కురుతరసుఖ
వసతులై యుండు కురుదేశ ♦ వరము *లుత్త
రాదిపదయుక్తములయి పెం ♦ పలర వెలయు. ౪౦ 1640

క ఘనపుణ్యమ్ములు చేసిన, మనుజులు తత్ఫలముఁ బొంద ♦ మహినందు జనిం
గనుదురు గావున నాక్షితి, కనకాంబురుహంబులెల్లఁ ♦ గడురమ్యములై.

తే తనర నీలవైడూర్యర ♦ త్నములపోల్కి
ఛాయనొప్పెడు పద్మినుల్ ♦ చాల వెలయ
జలసమృద్ధములౌ మహా ♦ శైవలినులు
వేనవేలుగఁ బ్రవహింప ♦ వెలయుచుండు. ౪౧ 1642

క. అరుణోత్పలములచే బం,గరు కల్వలచేత మిగులఁ ♦ గ్రాలి తరుణభా
స్కరవర్ణోత్పలములచేఁ, బరఁగుచుఁ దత్సరసులెల్ల ♦ భాసిలుచుండున్. ౪౨

సీ. అభిరామనీలర ♦ త్నాంచితపత్రముల్ కనకకేసరములు ♦ గడువిచిత్ర
ములుగఁ గన్పడ నల్ల ♦ గలువలనొప్పారు కొలఁకులెల్లెడలను ♦ వెలయు నందు;
నందలినదులలో ♦ ససమానములగు ముత్యంబు లనర్ఘర ♦ త్నంబు లల్లై

* ఉత్తరాః కురవ స్తత్ర - అని మూలము. ఉత్తరాదిపదయుక్తములయి = ఉత్తరపద మాది యందుఁ గలవియై.

కనకము పులినాకృ♦తిని గానఁబడుచుండ నదులెల్ల వెలయు, న♦నర్ఘ్యరత్న
మయపర్వతంబులు♦మఱియు స్వర్ణాద్రులు *హుతవహసమకాంతు♦లొప్పమిగుల

తే. నానదులయంతరంబున ♦ ననురియుండు
నచటితరువులు సతతపు♦ష్పాంచితములు
పక్షిగణనిబిడంబులు ♦ భవ్యగంధ
సాంద్రములునయి యొప్పారు ♦ సత్ఫలముల. ౪౫ 1614

క. కోరినవాంఛల నొసఁగుచు, ధారణినం దలరుఁ గొన్ని♦తరువరములు శృం
గారాంబరముల నొసఁగు; మ,హీరుహములుకొన్నియందు♦నెసఁగుచుమిగులన్.

తే. ముత్తియంబుల వైడూర్య♦ములను గూర్చి
యున్న చిత్రభూషణములు ♦ సన్నుతముల
సర్వకాలసేవ్యంబులఁ ♦ జానలకును
బురుషులకుఁ దగినట్లుగఁ ♦ గరమొసంగు. ౪౮ 1646

ఆ మిగుల విలువగలిగి ♦ మించి చిత్రములగు, నాస్తరణము లొప్పు♦నట్టి పాన్పు
లను నొసంగుచుండు; ♦ ఘనతమతరువులు, వానిమహిమ నెన్న♦వచ్చునెట్లు.

చ. తరువులు కొన్ని చిత్తము ము♦దంబును బొందఁగఁ జేయఁజాలు భా
సురసుమమాలికావళిని ♦ శుభ్రములై తగు పానకంబులన్
గరమరుదైన భక్ష్యములఁ ♦ గాంక్షలుతీఱ నొసంగుచుండు; సుం
దరగుణరూపయౌవనని♦తంబినులన్ మఱికొన్ని యిచ్చెడున్. ౫౦ 1648

క. తరుశాఖులైన విద్యా,ధరగంధర్వులును నాగ♦తల్లజులును గి
న్నర కింపురుషులు సిద్ధులు, తరుణులతోఁ గూడి యచటఁ♦దారుంద్రు తమిన్.

తే. సుకృతకర్ములు క్రీడావి♦శోభితాత్ము, లబ్ధకామసమృద్ధులు ♦ నైన వార
లందఱుం దమకాంతల ♦ నలరి కూడి, యట వసింతురు సతతంబు♦హర్షమలర.

క. గీతధ్వనులను వాద్యపు, మ్రోతలు హాసితధ్వనులును ♦ మునుకొని యందున్
భూతాళి కింపుగా విన, నైతగు సతతంబు సుంద♦రాకృతిమీఱన్. ౫౩

క. వినుఁ డందున్ సంతోషము, గననట్టి జనుండు, చెంతఁ ♦ గాంతామణి లే
నినరుం డొకఁడైనను నటఁ, గనరాఁ డనుదినము వృద్ధి♦గను సౌఖ్యాదుల్.

క. కురుదేశంబును దానిని, త్వరగా దాఁటి చనఁ గాన ♦నగు నొక్కట ను
త్తరవార్ధి తదంతరమున, హిరణ్మయసోమశిఖరి ♦ యెసఁగు ససమ్మై

క. సురపతిచతురాస్యాసుర, హరణమహాలోకములు స♦దా వానయుగాఁ
బరఁగిన దివిజాలె తదూర్ధ్వ, ధరముఁ గనంగలుగు పరులు ♦ దానిఁ గన రొగిన్.

చ. ఖరకరుఁ డందు వెల్గమిని ♦ త్వాస్థల మయ్యుది దుర్నిరీక్ష్యమై
పరఁగుచు భాసమానుఁడగు♦భాస్కరుకాంతిని వెల్గు దేశము

* హుతాశనసమప్రభైః - అనిమూ.

ట్లురుతరతేజముల్ వెలయ♦నొప్పిన పర్వతరాజకాంతిచే
నిరతము భాసమానమగు ♦ నెమ్మిని దానిఁ గనుండు పూర్వికమై. ౫౭॥ 1655

చ. వినుఁ డట విశ్వరూపుఁడగు♦విష్ణువు రుద్రగణైకయుక్తుఁడై
తనరు సదాశివుండు విబు♦ధవ్రజనాయకుఁడైన బ్రహ్మయున్
అనిశము బ్రహ్మమౌనియుతు♦లై వసియింతురు; మీకు నెల్ల నా
జనపదసీమదాఁటి చన ♦ శక్యముగాదు శ్రమంబు నొందినన్. ౫౮ 1656

ఆ. కాన నుత్తరమునఁ ♦ గలదేశమున కేగ, వలదు; భూరిశక్తి♦వైభవంబు
గలుగు దానవాదు ♦ లలరి యవ్వలఁ జనఁ, గలరు గమనశక్తి♦కలితులగుచు.

[1]క. గిరియది దుర్గమమగు నిర్జరులకునుం గూడ; దానిఁ ♦ జయ్యనఁ గని స
త్వరగతి మరలుఁడు మీరును, హరులకు నిందాఁకఁ జనఁగ♦నర్హము సుండీ!.

తే. అవలిదేశ మభాస్కరం ♦ బంధకార
బంధురంబయి నగరముల్ ♦ పత్తనాదు
లనెడు మర్యాద లేకుండు♦టను దెలియదు
మాకునుంగూడఁ గావున ♦ మీకునట్లె. ౬౧॥ 1659

చ. వనచరులార! మీకిపుడు ♦ బాగుగ నే నెఱిఁగించినట్టిచో
ట్లను బనిపూని చూడుఁడీ! యి♦లాసుత నే నటఁ దెల్పినట్టిచో
ట్లు నెగడునేని వానిని గ♦డుం దమిమీఱఁగ బుద్ధివైభవం
బున నరయుండు; కీశగణ♦పుంగవులార! తలంప మీరొగిన్. ౬౨॥ 1660

[2]క. అనిలానలోపములు గావునఁ జక్కఁగ రాముపత్ని ♦ భూసుత వెదకం
జను నాకార్యము సాధించినచో శ్రీరామునకును ♦ జిత్తంబలరున్. ౬౩

క. ఘనమున నంతకు మించిన, యనుపమమోదంబు నాకు ♦ ననిశము గలుగున్
వనచరులారా! కార్యం, బున సఫలత నొందినన్ బ్ర♦భూతమనములన్.

తే. బంధువులతోడ మీరు నా♦వలన రమ్య
తరములౌ గౌరవములంది ♦ పరరహితులు
నగుచుఁ బ్రియురాండ్రఁగూడి కృ♦తార్థులగుచు
ధరఁ జరింపఁగఁగలరు నం♦తతము స్వేచ్ఛ. ౬౪॥ 1663

నలుపదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

1 ఏతావద్వానరైః శక్యం గంతుం వానరపుంగవాః-అనిమూ. హరులు=కోఁతులు. 2 కృతం భవిష్యత్యనిలానలోపమాః-అనిమూ.

## ౪౪ - వ సర్గము.

రాముఁడు హనుమంతున కంగుళీయక మొసఁగుట.

[1]క. హరిపతియు విశేషించియు, మరుదాత్మజునకును సుగుణ♦మండనుఁడై శ్రీ
వరుఁడైన రాముఁ దెల్పుచు, గురుతరతత్కార్యభరము ♦ గోదువపడకయే ౧

ఆ. అతనియందె యునిచి ♦ యాంతఁడె తనకార్య
మెల్లఁ దీర్చుననుచు ♦ నెదను నమ్మెఁ;
గాన నఖిలకీశ♦కాంతుఁ డాసుగ్రీవుఁ
డధికహర్షమొంది ♦ యతులశౌర్య. ౧½ 1665

క. అనిలాత్మజు నాహనుమను, గని పల్కెన్; వనచరేంద్ర! ♦ కనఁగ నజాతీ
యనిఖిలశత్రుయుతంబగు, ననంతపయిఁగాని జలధ♦రావృత మగుచున్. ౨½

[2]సీ. ఆలంబమే లేని ♦ యాకాశమునఁగాని వాతచక్రంబున ♦ వఱలుచున్న
యంబరంబునఁగాని ♦ యధికశక్తులమీఱు నసురులుండెడు స్వర్గ♦మందుఁగాని
తిర్యగ్గణంబులు ♦ తిరుగఁజాలనియట్టి జలములలోఁగాని ♦ లలితగతిని
సంచరింపఁగలావు; ♦ మించెడు నసురగంధర్వాహిమర్త్యత్రి♦దశజగములు

తే. జలధిభూధర వేష్టిత♦సకలజగము
లరయఁగా నీవెఱింగిన ♦ వగును జుమ్ము
జనగతులు లాఘవంబు తే♦జంబు నెక్కుఁ
డయిన నీతండ్రివలె నీకు ♦ నలరుచుండు. ౫ 1667

క. పనివడి వెదకినఁ దేజం, బున నిను మించంగఁజాలు ♦ భూత మెదియునున్
గనరాదు జగతి సమతం, గనునదియును గానరాదు♦గా కపివర్యా!. ౫½

క. కనుకన్ జానకి యేక్రియ, మనకున్ లభియించునట్టి♦మార్గము నీవే
కని కార్యము నెఱవేర్పం, జను: నీతిని బండితుఁడవు ♦ సకలజగములన్. ౬

తే బలము బుద్ధియునుం బ్రతా♦పంబు దేశ
కాలముల ననువర్తించు ♦ గాఢశక్తి
యనునయంబివి యెల్ల నీ♦యందునున్న
యట్టు లితరులయందుండ ♦ వనని నెందు. ౭ 1670

చ. అని కపినాయకుండు పవ♦నాత్మజునందు సమస్తకార్యముం
బనివడి పెట్టుటప్పు డటు ♦ పల్కినవాక్కులచే నెఱింగి తా
మనమునఁ గార్యభారము న♦మానుమశక్తిఁ జెలంగు నాంజనే
యునిపయి నున్నదం చరిసి ♦ యొప్పుగ నిల్చినెంచె రాముఁడున్. ౮ 1671

1 ఈయధ్యాయమున నిశ్చితప్రయాణకార్యానంతరకార్యరూపమగు నంగుళీయకప్రదానము చెప్పఁబడుచున్నది. దక్షిణదిగ్గమనమునకు నియుక్తులగునాయకులలో నగ్రగణ్యుఁడు హనుమంతుఁడౌట నాతిఁడే కార్యమును సాధింపఁగలఁడనునమ్మకముచే నాయనిలాత్మజునిచేతికి ముద్రిక నిచ్చుచున్నాఁడని యిటఁ దెలియుఁదగు. 2 నభూమౌ నాంతరిక్షేవా నాంబరే నామలయే-అనిమూ. ఇట నంతరిక్షాదిశబ్దములకుఁ గలయర్థభేదము వ్యాఖ్యాతృప్రతిపాదితమేయని యెఱుంగవలయు.

చ. తరణికుమారుఁ డీహనుమ ♦ తప్పక కార్యము చేసితీఱునం
చురుతరనిశ్చితార్థుఁడయి ♦ యుండెడుఁ బావని చేయఁజాలు నె
క్కరణినినైనఁ జేయఁదగు♦కార్యముఁ బూర్వ మనేకకార్యముల్
సరిగ నొనర్చియుంటయును ♦ సర్వజనంబు లెఱింగిరే కదా!. ౯౪ 1672

చ. కనుకనె వానరేశ్వరుఁడు ♦ గైకొని యీతని గారవించెడున్
హనుమ ప్రయాణమై చనిన♦యప్పని సిద్ధిని బొంది తీఱు నం
చనుపమచిత్తముం దరసె; ♦ నంతట నమ్మహనీయతేజుఁడై
తనరు రఘూత్తముండు ప్రమ♦దంబున యత్నమొనర్చు నాతనిన్. ౧౦౪ 1673

చ. అనిలతనూజువిశ్రుతిని ♦ నాదృతి మీఱఁగఁ గాంచి యంతటన్
మనమున నింద్రియంబులు స♦మస్తవిధంబుల హర్షమొందఁగాఁ
దనను గృతార్థయత్నునిగఁ ♦ దద్దయు నెంచుచుఁ బ్రీతుఁడై మహీ
తనయకు నానవాలుగ ని♦తాంతము ముద్దులుగూర్చు నుంగ్రమున్. ౧౧౪

*క. తననామము ముద్రింపం, గను బడి బలుకాంతిమీఱి ♦ కాంతకు మదిలో
న నెఱుఁగఁదగు నద్దానిని, హనుమంతున కొసఁగి పల్కె ♦ నాదృతి మీఱన్.

సీ. ఆనవా లిద్దాని ♦ నాజనకాత్మజ హరివర్య! కనుఁగొని ♦ యాత్మలోన
ననుమానభయముల ♦ నంటక నాచెంతనుండి వచ్చితివని ♦ యొప్పుమీఱఁ
గను నిన్ను; నీబలం♦బును వ్యవసాయంబు విక్రమంబును నేను ♦ వినఁగ నిపుడు
సుగ్రీవుఁ డొసఁగిన ♦ శుభదసందేశంబుఁ గార్యంబు ఫలియింపఁ♦గలదటంచుఁ

తే. జెప్పుచున్నట్టు లున్నవి; ♦ శ్రీకరంబు
లగుచునని పల్కె; నంత న♦య్యంగుళీయ
కమును గైకొని తనను స్త♦కమ్ముఁ జేర్చి
కరములన్ మోడ్చి శ్రీరాము♦చరణములకు. ౧౨౪ 1676

క. మరుదాత్మజుండు మ్రొక్కుచు, నరుగం బూనెం; బరాక్ర♦మాధికుఁ డాతం
డురుతరవానరసైన్యము, కరమనురాగమున బలిసి ♦ కదలఁగ నంతన్. ౧౩౪

క. ఘనములు లేని వియత్తల,మునఁ దనమండలము స్వచ్ఛ♦ముగఁ దగ నక్ష
త్రనికరశోభితుఁడగు చంద్రునిభంగి వెలింగె; రఘువ♦రుండును మరలన్. ౧౪

చ. అనిలతనూజ! నీవును మ♦హాబలశాలివి సింహవిక్రమం
బునకు సమానమై పరఁగు♦భూరిపరాక్రమ మొప్పునాఁడనై
తనరుదు వట్టిలోటు నిటఁ ♦ బావకభూరిబలంబు నమ్మితిన్

* దదౌ తస్య తతః ప్రీత స్స్వనామాంకోపశోభితమ్-అనిమా. రామాయణకాలమున నక్షరములు లేవు. కంఠపాఠము చేయుటయే గాని పుస్తకసామగ్రి ధరణిలేదన్న దుర్వాద మీశ్లోకమున నెగిరిపోవునని తెలియఁదగు.

[1]గనుకనె నీదుశౌర్యములఁ ♦ గన్పడఁజేసి మహీకుమారి యా
జనకజ కానవచ్చుగతి ♦ నల్పము యత్నము సర్వరీతులన్. ౧౭ 1679

నలువదినాలుగవ సర్గము సంపూర్ణము.

---

## ౪౫ - వ సర్గము.

### వానరసేనాసన్నాహము.

[2]క. వనచరపతి సుగ్రీవుఁడు, వనచరులం బిల్చి రామ♦వసుధేశునిదౌ
పనిసిద్ధి నందుకొఱకి,ట్లనియెన్ మరలంగ ననూత ♦ నందిసముదితోన్. ౧ 1680

తే. ఎవ్వరెవ్వరి కేను నెం♦దెందు వెదకు
టెట్లు చెప్పితినో వార♦లెల్ల నందు
నందు నట్లట్లు వెదకనౌ♦ననియె; నంత
వనచరేంద్రులు భయనమా ♦ భర్తయాజ్ఞ. ౨ 1681

క. విని శలభంబులచందం,బున భూమిని నాకరించి ♦ పోవఁదలఁచి రం
త ననుజునితోడ రాముఁడు, వనచరపతి సీతఁజూచి ♦ వచ్చుటకొఱకై. ౩

క. సంకేతించిన యానెల, యింకను నెపుడెపుడు వచ్చు ♦ నెపుడు గడచు నే
వంకం బని యగునో యని, శంకించుచుఁ బ్రస్రవణవి♦శాలగిరిపయిన్. ౪

ఆ. తా వసించియుండెఁ ♦ దదనంతరము వీరుఁ, డైన శతబలియును ♦ నద్రివరన
మావృతునయి దివ్య♦మై యున్న యుత్తర,దిక్కునకుఁ జనఁగ మ♦దిం దలంచె.

క. వినతుండయి హరిపుంగవుఁ, డనుచరులం గూడి వేగ ♦ యరిగెను బ్రాగ్ది
క్కున సీతను వెదకఁగ; న,వ్వనచరనాయకుఁడు హనుమ ♦ బరవస మలరన్. ౫

క. తారాంగదాదిసహితుం, డై రయమున దక్షిణాశ ♦ నవనిజ వెదకం
గోరి పయనంబుఁ జేసెను, ఘోరంబగు పశ్చిమాశ♦కున్ వారుణికిన్. ౬ 1686

క. హరివర్యుఁడౌ సుషేణుం, డరిగెను నిజసేనఁ గూడి ♦ యర్కసుతుం డి
ట్లు రయంబునఁ గపినాథో,త్కరమును సకలాశలన్ వె♦దకఁబంచి తగన్. ౭

చ. వనచరముఖ్యులం బ్రకట♦పౌరుషశాలుర నిట్లు పంచి నె
మ్మనమున మోదమంది సుఖ♦మండితుఁడై తనరారె; నంత న
వ్వనచరనాథునాజ్ఞఁ గొని ♦ వానరయూథపులెల్ల నవ్వది
క్కును వెదకంగ వేగమునఁ ♦ గోరికలూరఁగఁ బోయి రెల్లరున్. ౮ 1688

సీ. జనకజ నిచటికిఁ ♦ గొనివత్తు నారావణాసురు జముప్రోలి ♦ కంపువార
మనుచు నార్చుచుమఱి♦యును సంతసంబునఁ బెడబొబ్బలిడుచు నవ్వ♦విక్రమముల

1 విక్రమై రనలైః-అనిమూలము  2 సమస్తా నబ్రవీ ద్భూచయః - అనిమూలము. సమః సర్వత్ర పక్షపాతరహితః-అనివ్యాఖ్య.

వినుతించుకొనుచును ♦ విపులసింహధ్వను లొనరించుచును స్వేచ్ఛ♦గను జెలంగి
పరుగులెత్తుచు వికృ♦తరవము లొనరించుచును బోయి; రంతట♦ఘనబలమునఁ

తే. బలికె నొక్కఁడు రావణుఁ ♦ డలుకపూని
యనికి వచ్చినఁ జంపెద ♦ నతని నేనె
యనుచు; నేరావణునిఁ జంపి ♦ జనకతనయ
శ్రమమునం గంపమొందెడు ♦ సాధ్వి నిటకు. ౧౧ 1689

క. కొనివచ్చెద నిప్పుడె మీ, రనుమానము లేక నిలువుఁ ♦ డంచను నిట నం
చని యొకఁడు పలికె; నేనే, జనకజఁ గొనివచ్చెదన్ ర♦సాతలసీమన్. ౧౨

ఆ. వసతి చేసియున్న ♦ బలమున ననిపల్కె
నొకఁడు; భూరుహముల ♦ నొక్కరీతిఁ
ద్రుంచివైతు నేను ♦ దొర్లింతుఁ గొండల
నేను ననుచు నొకఁడు ♦ పూని పలికె. ౧౩ 1691

చ. ధరణిఁ బగుల్తు నేననుచు ♦ ధైర్యము మీఱఁగఁ బల్కె నొక్కఁ; డే
నరిగి సముద్రము గ్గలఁత♦నంద నొనర్చెదనంచు నొక్కఁడుం
గరము ప్రగల్భవాక్యములను ♦ గాఢరవంబునఁ బల్కె; నంత నొ
క్కరుఁడనె నొక్కయోజనము ♦ గ్రన్నన దాఁటెద శక్తియొప్పఁగన్. ౧౪

క. శతయోజనములు దాఁటెద, శతయోజన మెంత నాకు ♦ సమధికదూరం
బతిజవమున దాఁటెద నే, నితరులు పొగడంగ ననిరి ♦ యెంతయుఁ బూన్కిన్.

చ. ధరణిని సాగరంబులను ♦ ధాత్రిధరంబులఁ గాననంబులన్
ధరణికిఁ గ్రిందిలోకమునఁ ♦ దద్దయు శక్తిని నడ్డులేక సం
చరణము చేయఁగాఁగలను ♦ శౌర్యము మీఱఁగనంచుఁ బల్కె నొ
క్కరుఁ; డవు డివ్విధంబున న♦ఖండబలంబుల వానరుల్ కపీ
శ్వరుఁడు వినంగఁ బల్కిరి వి♦భంగపరాక్రమయుక్తులై తగన్. ౧౬ 1691

నలువదియైదవ సర్గము సంపూర్ణము

---

## ౪౬ - వ సర్గము.

సుగ్రీవుఁడు భూమండలజ్ఞానము తనకుఁ గల్గినరీతి రామునితోఁ జెప్పుట.

చ. వనచరముఖ్యు లిట్లరుగ ♦ భాస్కరపుత్రునిఁ గాంచి రాముఁ డి
ట్లనియెను క్షోణిమండలము♦నంతయు నెట్లు లెఱింగితీవు నా
విని కపివర్యుఁ డంత రఘు♦వీరునకుం బ్రణమిల్లి యివ్విధం
బున వచియించె; నోపురుష♦పుంగవ! సర్వమెఱుంగఁ జెప్పెదన్. ౨ 1695

తే. ఆలకింపుము దుందుభి♦యనెడు దనుజ
వరుఁడు మహిషాకృతిని దాల్చి ♦ వచ్చి వాలి
ననికిఁ బిల్వఁగ వాలి యా♦తనిని మలయ
పర్వతగుహాకుఁ దఱిమె; దో♦ర్బలము మెఱయ. ౩ 1696

చ. దనుజుఁడు నబ్బిలంబుఁ జొఱఁ ♦ దానును వాని వధించునిచ్ఛచేఁ
జనియెను లోని; కంత నను♦జన్ము వినీతుని నన్ను ద్వారసీ
మ నునిచెఁ గాపుగా; నవల ♦ మామకసోదరుఁ డబ్దపూర్తియై
నను నటనుండి రాకయె పె♦నంగుచు నుండెను దానవేంద్రుతోఁ. ౪ 1697

క. బిలమంత రక్తపూరం, బులతోడఁ నిండె దానిఁ ♦ బొడఁగని నేనుం
గలవిలపాటచ్చెరువును, బొలయుట మదిలోనఁ గీశ♦పుంగవున కనిఁ. ౪½

ఆ. ఏమిసంభవించె♦నో? మాయరక్కసు, చేత ననుచు వగలఁ ♦ జెంది విషముఁ
దిన్నవానిపగిది ♦ దీనుఁడనైతి నా, యన్న దెగియెఁ గలన ♦ నన్నబుద్ధి. ౬½

క. కలిగె న్నాకంతట; నా, బలశాలి సురారి యందె ♦ పడియుండంగా
వలయును రాఁజాలక యి,మ్ముల మృతిఁగన వలయునన్న♦బుద్ధిని నేనుఁ. ౭

తే. ఆమహాద్వారమునఁ గొండ♦యంత గండ
శిలనమర్చియె గప్పితిఁ ♦ జిత్తమందు
వాలిజీవితమందాశ ♦ వదలి పురికి
వచ్చి తారను సుమను గొ♦ప్పదగు సిరిని. ౮ 1701

క. పరమమగు రాజ్యపదమును, బరిగ్రహించితిని సచివ♦వర్యయుతుఁడనై
పురివసియించితి విగత, జ్వరుండనయి; యంత దనుజ♦సత్తము ననిలోఁ.

క. తనశక్తిఁ జంపి వాలియు, జనుదెంచెను; నేను నంత ♦ సాధ్వసమున నె
మ్మనమున వడఁకఁగ గౌరవ, మునరాజ్యము నొసఁగితిఁ బ్ర♦భూతనయమునఁ.

చ. అతఁడును దుష్టబుద్ధిఁగొని ♦ యాగ్రహమూని ప్రచండశౌర్య ము
ద్ధతియును గ్రాల నింద్రియవి♦తానములెల్లఁ గలంగ నన్నుఁ బం
చతఁ గనఁజేయఁగాఁ దలఁపఁ♦బాఱితి మంత్రులతోడఁగూడి వే
యతఁడును గోపమూని నను ♦ నారయుచుం జనుదెంచెఁ జంపఁగఁ. ౧౧

ఆ వాలి సాధ్వసంబు♦వలన మంత్రులఁ గూడి, బహువిధంబులైన ♦ వనతటినుల
నగరములను గనుచు ♦ బెగడొంది పాఱితి;, ధరణినెల్ల గోష్ప♦దంబురీతి.

తే. అద్దముంబోలెఁ గొఱవి చ♦క్రాకృతిగతిఁ
గంటి నేనును వాలియు ♦ వెంటనంటి
వచ్చుచుండంగ వడివడిఁ ♦ బరుగువాఱి
తూర్పునకుఁ బోయి బహువిధ♦ద్రుమవితతుల. ౧౩½ 1706

క. ధరణీధరముల నదులను, సరస్సులను గంటి; నట వి♦శాలంబగుచుం

బరఁగుచు గైరికధాతూ, త్కరమండితమైన యుదయ♦ధరణీధరమున్. ౧౪½

క. అనిశం బప్సరసలచే,తను సేవింపంగఁబడుచుఁ ♦ దద్దయు బెడఁగై
కనఁబడు క్షీరసముద్రముఁ, గనినాఁడను; బ్రాక్కునుండి ♦ కడువేగమునన్.

ఆ. మరలివచ్చుచుండ ♦ మాయన్న నావెంట
నంటి తఱుమ మరలి ♦ యచటినుండి
వింధ్యశైలవృక్ష♦వితతిసంవ్యాప్తమై
చందనద్రుమాళి♦సాంద్రమగుచు. ౧౫½ 1709

క. తనరారు దక్షిణాశకుఁ, జనఁగాఁ బరుగెత్తినాఁడ ♦ సరగున నందుం
గనుపట్టు వృక్షగిరినదు,లను గాంచుచుఁ బోవ న న్న♦లఘువిక్రముఁడై. ౧౬½

క. మాయన్నతఱిమె నేనును, గాయము చేష్టలను దక్కఁ♦గాఁ బడమరకున్
బోయితి నటఁగల తరుసము,దాయము గిరిదేశములను ♦ దగ నస్తాద్రిన్. ౧౯

క. కని యందె యున్ననన్నును, గనలుచు మాయన్న తఱుమఁ♦గా నుత్తరది
క్కునకుం బోయితి నచటితు,హినగిరి మేరుక్షమాధ♦రేంద్రంబులనున్. ౨౦

క. ఉత్తరజలనిధిఁ గంటిన్, జిత్తము పొగులంగ నెచటఁ ♦ జేరిన నతఁడా
యత్తమతియౌచుఁ దఱుమఁగ, నెత్తఱి శరణంబులేక♦యే నుండంగన్. ౨౦½

తే. బుద్ధిసంపన్నుఁడౌ వాయు♦పుత్త్రుఁ డిట్లు
పలికె ననుఁజూచి; కపిరాజ! ♦ యలమతంగ
మౌని యీయాశ్రమంబుల ♦ మండలమును
గూర్చి హరిపతియౌ వాలిఁ ♦ గోపమూని. ౨౧½ 1714

క. మును శపియించెను గాదే, వనచరనాథా! యదిప్డు ♦ బాగుగ నానె
మ్మనమునఁ దోఁచినయది; యౌ, మునిశాపమ వలన నుటజ♦మునువాలితగన్.

క. చొచ్చినయెడ నాతనితల, యచ్చుగ శతశకలములుగ ♦ నవనిఁబడుఁగదా
యచ్చట సుఖముగ నుందుద, మిచ్చగ నుద్విగ్నులమయి ♦ యెల్లరమింకన్.

చ. అనవిని యోరఘుప్రవర! ♦ యంతట నేనును బుశ్యమూకముం
గనఁ జనుదెంచినాఁడఁ గపి♦కాంతుఁడు వాలి మతంగమౌనిభీ
తిని నిట రాకయుండెను; క్షి♦తిప్రవరా! రఘువంశభూషణా!
విను ఘపుడేను నివ్విధిని ♦ విశ్వము సంతయుఁ గన్నులారఁగన్. ౨౪½ 1717

క. కనినాఁడ నంతటన్ సచి,వనికరమును గూడి మౌని♦వర్యుని శాపం
బున వాలి చొరఁగ నేరని, ఘనగిరి నిద్దానిఁ జేరఁ ♦ గలిగితిఁ దండ్రీ!. ౨౫

నలువదియాఱవ సర్గము సంపూర్ణము.

---

## ౪౭ - వ సర్గము.

-- హనుమదాదులు తప్పఁ దక్కిన కపులెల్లను గిష్కింధకు వచ్చుట. --

చ. వనచరనాథు నానతిని ♦ వారిజనేత్రను జూచిరాఁగ న
వ్వనచరులెల్ల దిక్కులకుఁ ♦ బంతము లాడుచు వేగపోయి రం
త నదుల సత్సరస్సుల ల♦తాభవనంబుల నెవ్వి లేనిచో
ట్లను నగరంబులం దటిను♦లం జొరరాని మహీతలంబులన్. ౧౻ 1719

క. గిరులను సీతాదేవిని, బరికించుచుఁ గీశసంఘ♦పతియాజ్ఞను వా
నరయూథపులెల్లరు భూ,ధరవనకాననములెల్లఁ ♦ దగ వెదకి యటన్. ౩ 1720

*చ. జనకజఁ గాంచుకార్యమునఁ ♦ జాలఁ బ్రయత్నము గల్గియే దివం
బునఁ బగలంతయున్ వెదకి ♦ భూమిని రాతిరియందు నొక్కచో
టను గుమిగూడుచుండిరి, దృ♦ఢంబగు విక్రమ మొప్పుచుండ న
వ్వనచరు లానెలంగలది♦వంబుల సీతను నెల్లతావులన్. ౪౻ 1721

ఆ. వెదకి రాత్రులందు ♦ వివిధ ర్తుసుమఫల,ములను వెలయువృక్ష♦ములను జేరి
యందుఁ బండుకొనుచు ♦ నవ్వల నరుగుచుఁ, గాంచి కాంచి సీతఁ ♦ గానలేక.

సీ. పయనంబు చేసిన♦పగలు మొదలుకొని నెల నిండునంతకు ♦ నిలను నింగి
వెదకి నిరాశులై ♦ విభునియొద్దకు వచ్చి వృత్తాంత మెఱిఁగించి ♦ వేగ మాల్య
వంతమన్ శైలంబు♦చెంతకుఁ బోయిరి; బలశాలి వినతుఁడన్ ♦ ప్లవగవిభుఁడు
సచివులతోఁగూడి ♦ క్ష్మాపతిచెప్పినవిధమునఁ బ్రాగ్దిక్కు ♦ వెదకి సీతఁ

ఆ. గాన కరుగుదెంచెఁ ♦ గపిపతి శతబలి
యుత్తరమున వెదకి ♦ యుర్విపుత్రిఁ
గాన కరుగుదెంచెఁ ♦ గపిసైన్యములఁ గూడి;
యంత నానుషేణుఁ ♦ డధికబలుఁడు. ౮ 1723

క. వనచరులఁ గూడి పడమర, గనుఁగొని మాసంబునిండఁ♦గా సేనలతోఁ
జనుదెంచె నధిపుచెంతకు, జనకజనుం గానకుండ ♦ స్వాంతము దూలన్. ౯

ఆ. వారలెల్లఁ బ్రస్ర♦వణపర్వతంబున, రాముఁ గూడినకపి♦రాజునొద్ద
కరుగుదెంచి మ్రొక్కి ♦ యణఁకువ నిట్లని, రఖిలగిరులఁ గాన♦నాటవులను.

క. జనపదముల నదులను న,వ్వననిధితీరముల నెల్ల♦భంగుల సీతాం
బను వెదకితి మీవు వచిం,చిన గుహాలన్ వెదకితిమి వి♦చిత్రగతులతోన్ ౧౧౻

సీ. తీఁగజొంపమ్ముల♦తోఁగూడిన మహాత్తరములగు గుల్మంబు♦ల మఱి దుర్గ
మప్రదేశంబుల ♦ మనుజులు చొరరాక విషమంబులైన బృ♦ధ్వీస్థలంబు
లను పూన్కి వెదకితి ♦ మనితరసాధ్యప్రమాణదేహమ్ముల ♦ మలయుచున్న
ప్రాణులఁ గనుచును♦రావణుఁడో? కాఁడో! యని వెదకుచు మృతి ♦ నందఁజేసి

* విచిత్య దివసం సర్వే-అనిమూలము.

తే. లిమి, మహాబలయుక్తవం♦శమున హనుమ,జననిఁ గాంచినవాఁడు సు♦సత్వశాలి
జనకసుతయున్న దెసకుఁ దా♦జనిన వాఁడు,గాన సీతను గాంచి రాఁ♦గలఁడతండె

నలువదియేడవ సర్గము సంపూర్ణము.

---

౪౮ - వ సర్గము.

హనుమదాదులు దక్షిణమున సీతను వెదకుట.

క. అనిచెప్పి రంత; శ్వసనుని, తనయుఁడు తారాంగదాది♦వరోజ్జ్వలకీ
శనిచయయుతుఁడై దక్షిణ,మునకుం జని వానరౌఘ♦ముఖ్యు ననుమతిన్. ౧

క. ధరణీస్థలముల వెదకం, బరమానరుఁ డయ్యె; నతఁడు ♦ వనచరవీరో
త్కరములతో బహుదూరం, జరిగి యటన్ వింధ్యగిరిగు♦హాలగహనములన్. ౨

ఆ. పర్వతాగ్రములను ♦ బహుదుర్గమస్థలం,బులను భూరివృక్ష♦ములఁ గోలఁకులఁ
జాలుగాఁ జెలంగు♦క్ష్మారుహప్రతతుల, ఘనతరువుల వెలయు ♦ క్ష్మాధరముల. ౩

క. జనకజ వెదకిరి; వీర్యం,బునఁ దగు నక్కపులు యామ్య♦మున నెల్లెడలం
గనినను జనకనరేంద్రుని, తనయయుఁ గనరాకపోయె ♦ ధారుణి నెందున్. ౪

చ. ఫలముల మూలపర్ణముల ♦ భక్షణముం దమిమీఱఁ జేయుచున్
బలము చెలంగఁ బట్టుదల ♦ వర్ధిలుచుండఁగ దుష్ప్రధర్షులై
యిలసుత నట్టె చూచుచు న♦హీనజవంబునఁ బోవుచున్ మహీ
స్థలముల నందునందును ని♦తాంతము కష్టముపోవ నిల్చుచున్. ౫ 1732

సీ. చనుచుండి రావింధ్య♦శైలప్రదేశంబు బహుగుహావళులును ♦ గహనములును
గలయది కాన న♦క్కడఁ బరికించుట కష్టతరంబగు ♦ క్ష్మాస్థలమది
జనశూన్యమగుచు ని♦ర్జలమయి గహనమై కనఁగ గగుర్పాటు ♦ గలుగఁజేయు
చును నొప్పు; వనచర♦శూరులందఱు దాని విడిచియట్టివె యగు♦విపినములను

తే. వెదకి మిక్కిలి యలసట ♦ గదురఁ గుంది
యట్లె చొరరాని మఱియొక♦యడవి నెందు
భయము నొందనివారౌట ♦ బరవసమునఁ
జొచ్చి; రాదేశమునఁ దరు♦స్తోమమెల్ల. ౬ 1733

క. ఫలరహితంబయి పుష్పం,బులు లేకయె పర్ణహీన♦ముగ నొప్పును నం
దలినదులు సర్వకాలము, జలహీనము లగుచునుండు♦సైకత మొప్పన్. ౭

క. మూలమ్ములు లభియించుట, చాలఁగఁ గష్టంబు మహిష♦సామజమృగశా
ర్దూలము లుండవు పక్షుల,జాలము గనరాదు, వన్య♦జంతువు లెవియున్. ౮

క. కనరావు లలితతరువులు, కనఁబడ వోషధులు లతలు♦గాని పొదలునున్
గనఁబడ వందలి సరసులు, ననిశము స్థలములకునెల్ల ♦ నాకరములగున్. ౧౦

తే. మెట్టదామర లవ్వియు ♦ మిగులఁ బూచి
వాసనలు నెల్లచోఁ బర్వఁ ♦ బర్ణములును
జక్కఁగా నొప్పు సాధుదృ♦శ్యంబులగుచు
నుండుఁ దమ్మెదలెల్ల నం♦దుండ వెపుడు. ౧౧ 1737

చ. మునిపతి కండునామకుఁడు ♦ భూరితపోధనుఁ డుగ్రకోపి మా
ననిచయసత్తముం డొకఁడు ♦ నిల్చి యటం దపమాచరించు స
య్యనఘుఁడు సూనృతవ్రతుఁ డ♦హార్యమహత్తరసత్ప్రభావుఁడై
తనరుఁ దదీయపుత్రకుఁడు ♦ తద్వనమం దొకనాఁడు స్వేచ్ఛగాన్. ౧౨

క. తిరుగుచుఁ బదాఱుసంవ,త్సరముల ప్రాయమున నొప్పి ♦ దైవగతిన్ వే
మరణించెఁ బుత్రమృతి క, య్యరణ్యమునఁ గోపమూనె ♦ నమ్మునిపతియున్.

చ. నిరతము ధర్మచిత్తుఁడయి ♦ నిర్భరయోగము నూను నాతఁ డా
తరుణమునన్ శపించెను బ♦తత్త్రులకేని మృగాళికేని యె
వ్వరికిని గాని యయ్యడవి ♦ వాసముచేయ ననర్హమై వనుం
ధరఁ దగునంచుఁ గ్రోధమునఁ ♦ దాళఁగలేకయె సత్వరంబుగన్; ౧౪ 1740

చ. వనచరవీరు లందఱును ♦ బర్వతమందు గుహావళిం దగన్
జనతతి శూన్యమై తగు వి♦శాలవనంబుల నేర్లు పుట్టుచో
ట్లను బలుపూన్కిమై వెదకి ♦ లక్ష్మిసమానను సీతఁ గానమిన్
మనములఁ గుందుచున్ సతము ♦ మర్కటనాథహితైషు లౌటచేన్. ౧౫

ఆ. తిరిగి తిరిగి చాల ♦ దీనతఁ గని మఱి, యెల్లచోట్ల వెదకి ♦ యెందు సీత
నపహరించినట్టి ♦ యలరావణునిఁ గాని, క్షోణితనయఁ గాని ♦ చూడరైరి.

చ. వనచరులంత ధైర్యమున ♦ వారనిపూన్కి లతాళిగుల్మముల్
ఘనభయదంబులై వెలయ♦గాఁ గనుపట్టు మఱొక్క భాగముం
గని యటఁ జొచ్చి క్రూరతర♦కర్ము సురౌఘవిరోధి నిర్భయున్
దనుజుని నొక్కనిం గనిరి ♦ ధాత్రిధరంబన నొప్పువానినిన్. ౧౭ 1743

క. పెనుభీతి గలుగఁజేసెడు, దనుజుని నాతనినిఁ జూచి ♦ దట్టులఁ దగఁ గ
ట్టి నిలిచి రందఱు యుద్ధం, బున కాతఁడు పర్వతములఁ ♦ బోలినకపులన్. ౧౮

క. కని బల మలరఁగ నిట్లని,యెను జచ్చితి రిదిగొ మీర♦లెల్ల ననియె; న
ద్దనుజుం డంతటఁ గ్రోధం, బునఁ బిడికిలి పట్టుకొనుచుఁ♦బోయెఁబయిఁ బడన్.

క. దనుజుఁడు పైఁ బడవచ్చుటఁ, గని వాలిజుఁ డంగదుండు ♦ కఱకుదనుజు నా
తని రావణుఁగాఁ దలఁచుచుఁ, దనకరతలమునను జఱచె ♦ దర్పము పొంగన్.

క. సురవైరి యాతఁ డంగద, కరతలహతుఁడౌచు రక్త♦కణములు నోటం
గరము వెడలంగ నిలఁబడె, ధరణీధర మొర్విఁ బడువి♦ధంబున సంతన్. ౨౧

చ. దనుజుఁడు మృత్యువుం గనిన ♦ దర్పజయంబులఁ జెన్నుమీఱున
వ్వనచరు లాతఁడే దనుజ♦వర్యుఁడు రావణుఁడౌనటంచు న
జ్జనకజ యందెయుండునని ♦ సంతస మందుచు నాగుహాంగణం
బునఁ బలుభంగులన్ వెదకఁ ♦ బూనిరి కాంక్షలు పెంపుమీఱఁగన్. ౨౭

చ. వనమున నెల్లెడన్ వెదకి ♦ వారక తద్గిరిచెంతనున్న యిం
కనొక భయంకరాద్రిగుహఁ ♦ గాంచి తదంతరమందుఁ జొచ్చి; యం
దును గలయంగఁ జూచినను ♦ దోయరుహానన సీత యుండమిన్
వనటలఁ గుంది స్వాంతములఁ ♦ బాయనిదీనత నిర్జనస్థలం
బున నొకచోటఁ జేరి రురు♦భూరుహమూలమునందు నందఱున్. ౨౮ 1719

నలువదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

౪౯ - వ సర్గము.

హనుమంతుఁడు పెక్కుచోట్ల వెదకుట

[1]చ. వనచరనాథపుత్రుఁడును ♦ ప్రాజ్ఞుఁడునై తగు నంగదుండు న
య్యన వనరాజిలో వెదకి ♦ యంగము శ్రాంతిని బొంద సంతఁతన్
వనచరులం గనుంగొనుచు ♦ వారల నూఱడఁజెందఁ జేసి యి
ట్లనియె; వనంబులన్ గిరుల ♦ నల్లె నదీతటసీమలం దొగిన్. ౧౫ 1750

సీ. దుర్గమగహనమం♦దును బిలంబులఁ గొండగుహలను జనకుని♦కూర్మితనయఁ
జక్కఁగ వెదకితి; ♦ మిక్కడ నక్కడ జానకిగాని, యా♦సాధ్విదివిజ
కన్యకఁ బోలుచ♦క్కనిరాజపుత్రిని హరియించినట్టి య♦య్యసురఁగాని
కనరాకపోయిరి; ♦ కాలంబు చాలఁగాఁ గడచె; సుగ్రీవుఁడో ♦ కఠినశాస
తే. నుఁడుగదా శ్రద్ధఁబూని మీ♦రుడుగకెల్ల
తావులం దగ వెదకుఁడు; ♦ [2]తంద్రిఁగాని
శోకమునుగాని పొందక ♦ సొరిది పైనఁ
బడెడు నిద్రను బొందక ♦ పుడమితనయ. ౪౫ 1751

క. కనఁదగు వెరవున వెదకం, జను; విసుకుం గనమి మదిని ♦ స్థైర్యము గనియుం
ట నిరతముత్సాహంబును, గనుటయు నివి కార్యసిద్ధిఁ ♦ గలుగంజేయున్. ౫౫

క. అని పెద్దలు వచియించిరి;, కనుకనె యిటు పల్కినాఁడఁ ♦ గడుదుర్గమమా
వనమున నిట వెదకుండో, వనచరులారా! బలాభి♦వర్ధిష్ణు లగుచున్. ౬ 1753

తే. అలసటల మాని మరల న♦య్యటవి నెల్లఁ
గార్య మొనరించుచుండఁ ద♦త్కార్యఫల మ

1 సమాశ్వస్య శనై ర్వచః-అనిమూ. 2 తంద్రి=అలసట.

వశ్యముం గల్గుచుండుట ♦ వసుధఁ గానఁ
బడుచునున్నది; నిర్వేద♦పడుట విడిచి. ౭౪ 1754

క. అందఱమిటు నిదిరించుట, యుం దగ విడనాడి కార్య ♦ మొనరుపఁబూనం
గం దగు సుగ్రీవుఁడు క్రుధ, నందును దండించుఁ జూడి భ♦యంకరరీతిన్.

క. మనకుం బలియుం గావున, వనచరపతి కతనికిం బ్ర♦భావమహితుఁడై
ఘనబలుఁడౌ రఘుపతికిన్, మనము భయంపడవలయు స♦మస్తవిధములన్.

చ. వనచరులార! మీకు హిత♦భావమునం దగ నిట్లుచెప్పితిన్
గనుక మదుక్తియే హితము♦గాఁగనె మీకును దోఁచెనేని దా
నినె యొనరింపుఁ డెల్లరకు ♦ నిక్కముగా హితమైన కార్యముం
డిన నది చెప్పుఁడంచనియె ♦ నీతిని నంగదుఁ డిట్లుపల్కఁగన్. ౧౦ 1757

[1]క. విని గంధమాదనుఁడు దప్పిని శ్రమచే జెప్పరాని♦పీడ నలయుచుం
డినకతమున నస్పష్టవచనమున నిట్లనియెఁ; గీశ♦సత్తముఁ డిచటన్. ౧౧౪

సీ. మనకెల్ల హితవాక్య♦మును జెప్పె నిది యుక్త మానుకూల్యమునగుఁ♦గాన నెల్ల
కావింపుఁ డద్రులఁ ♦ గంధరంబుల బిలంబుల జనవిరహిత♦ములగువనులఁ
బ్రస్రవణంబులఁ ♦ బరమాదరంబున వెదకుదము మరల; ♦ విభుఁడు మనకు
నాజ్ఞ చేసినరీతి ♦ నంతట మీరెల్లఁ జేరి దుర్గమములగు♦భూరిశైల

ఆ. దుర్గమస్థలములఁ ♦ దోఁచనె వెదకుద, మనియె; గాఢబలము ♦ లలరు వాన
రాళి యంత లేచి ♦ యామ్యదిక్కున వింధ్య, కాననాళి వెదకఁ♦గాఁ గడఁగి.

చ. జనకజఁ గాంచుకాంక్షలను ♦ శారదమేఘసమానమై దరీ
ఘనతరకూటయుక్తమయి ♦ క్రాలెడు రాజతభాగ మొక్కచోఁ
[2]గని వెస నెక్కి యందొకటఁ ♦ గన్పడు లోధ్రవనంబు సప్తప
ర్ణనికరరాజితంబగు న♦రణ్యముఁ గాంచి కుతూహలంబులన్. ౧౬౪ 1760

ఆ. వెదకి రంత మిగుల ♦ విక్రమశాలురౌ, వారలగ్రభాగ ♦ మారసి కడు
శ్రాంతి నొంది రాము♦సాధ్విని వైదేహిఁ, గానరైరి పూన్కి♦గలిగి యవల.

సీ. బహుకందరముగు త♦త్పర్వతమందెల్ల వెదకి క్రిందికి వచ్చి ♦ విపులకష్ట
మునఁ బ్రజ్ఞదప్పి యెం♦దును సీతఁగానమి; నటనుండి వారెల్ల ♦ నవనికి దిగి
యించుక యందుండి♦సంచరించుచు నొకతరుమూలమును జేరి♦పరఁగ నందుఁ
గొంతకష్టము దీర్చు♦కొని ముహూర్తంబందు నుండి దక్షిణమున♦నుర్వితనయ

తే. వెదకఁబూనిరి కపిసంఘ♦వీరులైన
హనుమదాదులు పయనమై ♦ యాగిరీంద్ర

1 ఉవాచాస్పష్టయా వాచా పిపాసాశ్రమఖిన్నయా - అనిమూలము. 2 తత్ర లోధ్రవనం రమ్యం సప్తపర్ణవనానిచ-అనిమూలము.

మును మొదటనుండి యెల్లెడ♦లను వెదకఁగఁ
బూని తిరిగిరి రాజాజ్ఞఁ ♦ బూని యపుడు. ౨౨ 1762

నలువదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

౫౦ - వ సర్గము.

హనుమదాదులు స్వయంప్రభను జూచుట

చ హనుమయు వాలిపుత్త్రుఁడగు♦నంగదుఁ దారుని గూడి వింధ్యభూ
ధ్రనిఖిలకందరంబుల ను♦దారవనంబుల జానకీసతిn
గనుఁగొనువేడ్కతో వెదకె; ♦ గాఢరయంబున సింహముల్ పులుల్
గనఁబడ దుర్గమంబులయి ♦ కన్పడుభాగములన్ శిలావళిన్. ౧౺ 1763
*క. పెనుసెలయేళ్లను నదులను, జనకసుతన్ వెదకి యంత ♦ శైలంబునఁ గో
టిని దక్షిణపశ్చిమమును, గననేగిరి నియమితముగు ♦ కాలంబెల్లన్. ౨౺ 1764
క. వారికి గడచెను; నచ్చట, ధారణి కాననగుహావి♦తానవిబిడమా
టారయఁగ దురన్వేషం, బై రహితజనౌఘమగుచు ♦ నతిభయదంబౌ. ౩౺
చ. హనుమయు వానరావళిని ♦ నంతటఁ జేరువనుండ నిల్పి త
ద్వనమున నంచఱంగలిసి ♦ బాగుగ నెల్లెడఁ జూచెఁ దాను నం
త నతనివెంట వింధ్యగిరి ♦ దారుణకందరముఖ్యసీమలన్
గనుఁగొని రా గజుండు కపి♦కాంతుఁడు గాఁ నగు నాగవాత్ముఁడున్. ౪౺
సీ. గవయు, శరభులును ♦ గంధమాదనసుషేణులును మైందద్వివి♦దులును నలుఁడు
జాంబవదంగదుల్ ♦ చారురూపుండగు తారుఁడు శైలవి♦తానయుక్త
ములగు భాగంబులఁ ♦ గలయంగ వెదకుచు యామ్యదిగ్భాగంబు♦లందు వెదకు
చును బోయిగురుబిలం♦బునుగాంచిరొకచోట; క్షుత్పిపాసలఁజాలఁ♦గుందివార
తే. లలసటలఁజెంది త్రాగ స♦లిలములకయి
తిరుగుచుండఁగ బిలమొండు ♦ పరఁగె నందు
ఋక్షబిలమన మయునిచే ♦ రక్షితంబు
దుర్గమము పృథుతరముగఁ ♦ దోఁచునదియు. ౮ 1767
క. లతలును వృక్షములును సం,గతములుగా దానినిండఁ ♦ గప్పి వెలయును
న్నతములుగఁ గానఁబడియెన్, సతత మ్మందుండి క్రౌంచ♦సారసహంసల్. ౯
ఆ చక్రవాకములును ♦ సలిలంబులం దోఁగి
సరసిజములరేణు♦సమితితోడ
నరుణములయి వెలయు ♦ నంగములను గల్గి
బయలువెడలుచుండె ♦ బయలఁ జనఁగ. ౯౺ 1769

---

* ఆసేరు స్తస్య శైలస్య కోటిం దక్షిణపశ్చిమామ్-అనిమూలము.

చ. వనచరపుంగవుల్ రుచిర♦వాసన లొప్పఁగ దుర్గమంబుగాఁ
గనఁబడుచున్న యాబిలముఁ ♦ గాంచి మనంబుల విస్మయంబులం
గనిరి; మహాప్రతాపములఁ ♦ గాంచి బలంబుల మీఱియున్నపా
వని మొదలైనవానరులు ♦ వన్యమృగావళి నిండియుండఁగన్. ౧౦॥ 1770

క. బలినిలయ మట్లు చూడన్, వెలయుచు దుర్దర్శమగుచు ♦ భీతిని మిగులన్
గలుగంజేయుచుఁ జేరఁగ, వలనుపడని యబ్బిలమును ♦ బహువిధగతులన్.

క. కనియిది పాతాళంబో?, దనుజుల మాయయొ? యటంచుఁ♦దనుమదులన్ శం
కను బొందుచుఁ బోయిరి చెంతను జేరఁగ; నంతఁ బవన♦తనయుఁడుమిగులన్.

క. గిరికూటప్రతిమంబగు, శరీరమున గహనవనవి♦సరమార్గములం
బరిచయము గల్గి పొండితిఁ, బరఁగినవాఁడౌటఁ బలికె ♦ వనచరుల కటన్.

మ. మనమెల్లన్ శమనాశ నెల్లెడల నా♦త్మావుత్రినిం గాంచువే
డ్కను శైలవ్రజదుర్గమంబులగు మా♦ర్గస్తోమమెల్లన్ దగన్
ఘనయత్నంబునఁ గాంచినార మెచటం ♦ గంజాక్షినిం గానకే
వనటన్ మిక్కిలి బొందినార; మిచటన్ ♦ భాసిల్లు నీసద్గుహన్. ౧౪॥ 1774

క. మనభాగ్యంబునఁ గంటిమి, కనుఁడీ యిందుండి హంస♦గణసారసముల్
ఘనచక్రక్రౌంచంబులు, [1]వనములలో మునిఁగి వెడలి♦వచ్చెడుఁ జూండీ!. ౧౫॥

చ. తరువులు దీనిద్వారమున ♦ దట్టముగాఁ గడుసుందరంబుగాఁ
బరఁగెడు నిశ్చయం బిచట ♦ వారిపరిపూర్ణముగాఁ జెలంగి సుం
దరమగు కూపమొండెను ప్ర♦పంబయినం బరికింపనౌను; నా
హరిహరులెల్ల నట్లు పవ♦నాత్మజుఁ డాడిన నాలకించుచున్. ౧౬ 1776

[2]సీ. దానిఁ జొచ్చిరి మహా♦త్తరమగు బిలమది చంద్రసూర్యులప్రకా♦శంబె లేక
భయదమై గగురు♦పాటుఁ బుట్టించుచు నంధకారావృత♦మై చెలంగఁ
గాంచిరి వారెల్లఁ; ♦ గడఁగి సింహంబులు బహువిధమృగపక్షి♦వారములును
వెడలిరాఁ గాంచుచు ♦ విపులాంధకారావృతంబగు భూరికం♦దరము దానిఁ

తే. జొచ్చి రయ్యెడ వారిచ♦క్షువులు లేని
పౌరుషముగాని సుప్రభా♦వంబుగాని
గానఁబడదయ్యె వాయువు♦కంటె వార
లంధకారంబునం బడి ♦ యచట నిచట. ౧౭॥ 1777

క. తిరిగిరి; కపికుంజరు లా, కరణిన్ వేగమునఁ బోయి ♦ కాంచిరి తేజ
స్స్ఫురణమున నొప్పి సుందర, తరమగు దేశమును నొకటఁ ♦ దమకము లలరన్.

క. పలువిధములైన వృక్షం, బులతో దుర్గముగాఁగఁ ♦ బొలుపారెడు నా

1 వనములలో=నీటిలో. 2 నతేషాం సజ్జతే చక్షు ర్నతేజో నపరాక్రమః, వాయోరివ గతి స్తేషాం దృష్టి స్తమసి వర్తతే-అనిమూ.

బిలమున నొక్కరినొక్కరు, కలఁగుచుఁ బట్టుకొని యంధ♦కారమునందున్.

తే. యోజనం బొండు చనిరి య♦త్యుగ్రమగు పి
పాసచేఁ దొట్రుపాటొంది ♦ పయసుఁ గోరి
సంజ్ఞ దప్పియు వార ల♦శ్రద్ధఁగొనక
కొంతకాలము చనిరి త♦త్కుహరమందు. ౨౨౫ 1780

తే. అలసి సొలసి ముఖంబుల♦యందు దైన్య
మంకురింపఁగ జీవిత♦మందు నాశ
విడిచి యంతటఁ గాంచిరి ♦ వెలుఁగు నంత
విగతతిమిరము శుభమునై ♦ వెలయుచోట. ౨౩౫ 1781

క. హరివరులుచేరి హుతవహు, కరణిఁ దీపించు వృక్ష♦గణముల వరక
ర్బురమయముల సాలంబుల, సురపొన్నలఁ దాలముల న♦శోకతరువులన్.

తే. చంద్రలను నాగకేసర♦చంపకములఁ
గుసుమితములైన కొండగోఁ♦గులను గాంచి;
రందుఁ జిత్రంబులయి సువ♦ర్ణాకృతిఁదగు
పూలగుత్తుల నెఱ్ఱచి♦వుళ్ల మఱియు. ౨౪౫ 1783

తే. మంచిశేఖరములను న♦భ్యంచితంబు
లైన లతలను బోల్పారి ♦ హాటకాభ
రణములే పండ్లుగాఁగఁ ద♦రుణరవిరుచు
లవలె వెలుఁగొందుచును సువి♦లాసములను. ౨౬ 1784

సీసమాలిక:—

రంజిల్లి వైడూర్య♦రత్నవేదికలచేఁ గ్రాలుచు నిజరూప♦కాంతి నలరు
రజతవృక్షంబుల ♦ రమణఁ గాంచిరి; నీలవైడూర్యవర్ణముల్ ♦ వఱలఁ బత్రగ
సహితంబులయి బాల ♦ సరసిజబాంధవ సన్నిభభూరికాం♦చనసరోజ
సంవృతమ్ములయిన ♦ సరసిజలతలను స్వర్ణమత్స్యంబుల ♦ స్వర్ణకచ్ఛ
పములను నిర్మలాం♦భస్సుల నలరారు కొలఁకులఁ గనిరి క♦పులు మఱియును;
గనకగవాక్షము♦క్తాజాలవిలసితములగు విమానౌఘ♦ములను గనక
రజతమయంబుల; ♦ రమ్యసువర్ణరజతమయభౌమముల్ ♦ చాల వెలయ
వైడూర్యమణులచే ♦ భాసిల్లుచున్న గృహంబుల నెల్లెడ ♦ హరులు గనిరి;
పుష్పఫలంబులఁ ♦ బొదలి ప్రవాళంబులను బోలువృక్షంబు♦లను సువర్ణ
షట్పదంబుల మఱి ♦ చారుమధువులను మణికాంచనవిచిత్ర♦సహితశయ్య
లను నాసనంబులఁ ♦ గని రుత్తమములగు యానంబులను వార♦లంత నచటఁ
గాంచనరాజత♦కాంస్యపాత్రచయంబులను దివ్యచందన♦మును నగరువు
లను శుద్ధరుచ్యమూ♦లఫలంబులను, నుత్తమములగు పానక♦సహితమధువు
లను దివ్యవస్త్రంబు♦లను, జిత్రకంబళములను శ్రేష్ఠాజినం♦బులను, దీప్త

దహనుపోలికగాఁగఁ ♦ దగు తప్తహాటకసంచయుంబులను న♦చ్చటను బ్రోగు
గాఁ బడియుండంగఁ ♦ గాంచిరి; బలశాలులైన యాశూరు ల♦య్యద్రిగుహను
గనుఁగొనుచుంబోయి ♦ కని రొకవనితను జెంత నామెయు నార♦చీరలను మ
హాజినంబులఁ గట్టి ♦ యతినియతాహారయై తేజమొప్పంగ ♦ నమలతపముఁ
గావించుచుండెను; ♦ గపులెల్ల నామెను గని భీతినొందుచు ♦ నునములందు
విస్మయంబును బొంది ♦ వెఱఁదికి దవ్వుగా నిలిచియుండంగ న♦నిలతనయుఁడు

తే. పలికె నెవ్వతెవో నీవు? ♦ బిలమిదెవరి
దగునొ? యని ప్రశ్నచేసె; ♦ నా♦హనుమ గిరిస
మాకృతిం బొల్చి యప్డు సా♦ష్టాంగముగ న
మస్కరించి నయంబున ♦ మఱియుఁ బలికె. ౮౦ 1785

క. వనితా! నీవెవ్వతెవో?, ఘనతనుగృహ మీబిలంబు ♦ కమనీయమున
స్తునికర మియ్యది యెవరిదో, వినుపింపుము వేడుకయ్యె ♦ వినఁగన్ మాకున్. ౮౧

ఏఁబదియవ సర్గము సంపూర్ణము.

---

౫౧ - వ సర్గము

ఋక్షబి వృత్తాంతము స్వయంప్రభ వానరులకుం దెల్పుట.

క. అనియిట్లు పలికి శ్వసనుని, తనయుండు మహాజినమును ♦ ధరియించి తప
స్సును జేయుమహాభాగను, వనితామణి ధర్మనిష్ఠ ♦ వఱలెడుదానిన్. ౧ 1787

క. కని పలికె మఱియు నిట్లని, వనచరులము మేము వెతల♦బడలుచు తూల్పి
డను బొంది కప్పి నలసటఁ, గని యిట సలిలంబు లుండఁ♦గలవను నాశన్. ౨

తే. విన్నఁదనమున ముందును ♦ వెనుకఁ జూడ
కంధకారావృతంబగు♦నట్టి యీబి
లమ్ము జొచ్చితి; మేము దా♦హమ్ముకొఱకె
పెనుబిలము దీనిఁ జొచ్చితి ♦ మనఘచిత్త ౩ 1789

క. ఇందలి యద్భుతవస్తువు,లం దగఁ గని యేమి దని క♦లవిలంపడుచున్
డెందముల నేమితోఁచమి, నిందే యిటులున్నవార ♦ మింతీ! వ్యధలన్. ౪

చ. తరుణసరోజబాంధవువి♦ధంబున వెల్గెడు నీసువర్ణభూ
మిరుహవితానముల్ శుచిత ♦ మిక్కిలి యొప్పి మనోహరంబుగాఁ
బరఁగెడు మూలముల్ సుఫల♦వారము లియ్యవి, స్వర్ణరూపతం
గరము వెలింగ యభ్రగతిఁ ♦ గ్రాలువిమానము లివ్వి యేరివో!. ౫ 1791

చ. కనకగవాక్షముల్ మణిని♦కాయములుం దనరార వెండితో
ననుపమరీతిఁ జేయఁబడి♦నట్టి గృహావళు లివ్వియేరివో!

వనితరో! చారుపుష్పముల ♦ భాసిలి సత్ఫలముల్ చెలంగఁ జ
క్కనిపెనువాసనల్ పొలయఁ♦గాఁ బరిశుద్ధములై తనర్చు నీ
కనకమహీరుహంబులు త♦గఁ బ్రభవిల్లెను దేరి శక్తిచేఁ. ౫౪ 1792

ఆ. విమలజలములందు ♦ నెలసె నెన్వని ప్రభా,సమున స్వర్ణపద్మ♦వార మిద్ది;
కనకమత్స్యములును ♦ గనకకూర్మంబులు, సంచరించెడు నివి ♦ సాధ్వి! యెట్లు.

క. తెలియవు మాకీవిషయం,బులు గావున నివ్వియెట్లు ♦ పొలుచు? స్వశక్తిం
గలిగినవో? మఱి యెవ్వరి, యలఘుతపోబలమువలన ♦ నలరారెడునో?. ౭౪

క. ఉన్నది యున్నట్లుగ నో,సన్నుతచరితా! వచించి ♦ స్వాంతంబులయం
దున్న గురుసంశయంబులఁ, గ్రన్ననఁ దీర్పుమని పల్కఁ♦గా విని యంతన్.

తే. సర్వభూతహితైషిణి ♦ సాధ్వి ధర్మ
చారిణియునైన యానారి ♦ సకలకపులఁ
గాంచి హనుమంతునిం గూర్చి ♦ కరుణఁ బలికె;
మహిత తేజుండు దానవ♦మండనుండు. ౧౦ 1796

ఆ. మాయయందు నేర్పు ♦ మహిఁ బ్రవర్తిల్లఁగా
నలరు మయుఁడు తనమ♦హావిచిత్ర
శక్తినిందునుండి ♦ స్వర్ణవనము దీని
వెలయఁజేసె మఱియు ♦ లలితరీతి. ౧౦౪ 1797

క. కనకమయోత్తమభవనం,బును దీనిం గల్గఁజేసి ♦ పొగడొందినయా
దనుజుండె విశ్వకర్మగ, దనుజులకయి యుండెఁ గపివ♦తంసము! యతఁడే. ౧౧౪

*సీ. ఈమహావనమున♦నే పెక్కువేలేండ్లు నిలిచి తపోనిష్ఠ ♦ నియతి జరపి
శుక్రప్రణీతమై ♦ శోభిలు శిల్పశాస్త్రం బెల్లఁ దనదగు♦ధనముగాఁగ
బ్రహ్మవలనఁ దగ ♦ వరముగ బొందెఁ జూ! యంత మాయాబల♦మలరుచుండ
సకలకామసుఖాళి ♦ సంతృప్తిగాఁ బొంది యిమ్మహావనమున ♦ నెలమినుండి
కొంతకాలము చాలఁ♦గోర్కులు నొందుచు నివసించియుండె; దా♦నవవిభుండు

తే. హేమయను నచ్చరంగాంచి ♦ యింతియందుఁ
గామపరతంత్రుఁడై కూడి ♦ కడు సుఖములఁ
బడయుచుండుటఁ గని జగ♦త్పతి పురంద
రుఁడును వజ్రంబుఁ గొని కోప♦ముడరఁ బూన్కి. ౧౮౪ 1799

క. దనుజేంద్రుమయునిఁ గొట్టెను;, జనె నాతం డిచటువాసి ♦ సరసిజజని యా
కనకవనంబును, గనకభ,వనమును జిరభోగ్యదివ్య♦వస్తుచయంబున్. ౧౫ 1800

ఆ. హేమకొసఁగె; నోక♦పీశ్వర! మేరుసా,వర్ణితనయ నేను ♦ వనమున నిట
నిలిచి హేమవియగు ♦ నిర్మలసౌధాది,కములనెల్లఁ బూన్కిఁ ♦ గాచుచుండు.

* పితామహ ద్వారం లేఖే సర్వ మాశనసం ధనమ్-అనిమూలము.

క. పేరు స్వయంప్రభ యనఁగా, ధారణి విఖ్యాతినొందు♦దానను; నాకా
నారి రుచిగీతనటనవి, శారద చెలికత్తియయగు ♦ సరసమునీపా!. ౧౭ 1802

క. విను మితరతిరస్కారం,బును బొందకయుండునట్లు ♦ పొలఁతియు వర మి
చ్చెను నాకుఁ గాన నేనీ, వనమున నివసించి యీభ♦వనమును సతముం. ౧౮

ఆ. కాచుచున్నదానఁ; ♦ గార్య మెద్దానిని, గోరి యేలయిట్లు ♦ మీరు వనుల
వెదకుచున్నవారు? ♦ వితతదుర్గమమగు, నీవనమును గంటి ♦ రెట్లు మీరు.

క. తినఁదగు ఫలమూలంబులఁ, దిని జలములఁ ద్రావి తృప్తి♦దీర సమస్తం
బును నాకుఁ జెప్పవలయును, ననుపమగుణశౌర్యసార ♦ హరికులనాథా!. ౧౯॥

ఏఁబదియొకటవ సర్గము సంపూర్ణము.

---

## ౫౨ - వ సర్గము.

స్వయంప్రభకు హనుమ తమవచ్చినకార్యమును దెలుపుట.

క. అని నుతియు ధర్మచారిణి, మునినియమ తలోదరి యది ♦ మునుకొను శ్రద్ధం
గని విక్రమశాలుర నా, వనచరులం బలికె లలిత♦వాక్కు లలరఁగన్. ౧ 1806

క. ఫలముల భక్షించుట మీ, యలసుతరంబైన ఖేద♦మడఁగినచో ని
ర్మలతావకవృత్తాంతముఁ, దెలుపుఁడు నేఁ దెలియఁగోరి♦తిని కపులారా!. ౨

చ. అనవిని వాయుసూనుఁ డపు♦డార్జవ మొప్పఁగఁ గానకేగుదెం
చిన తమవార్త నివ్విధి వ♦చింపఁగఁ బూనె యథాక్రమంబుగా,
వనితరో! సర్వలోకపరి♦పాలకుఁడై వరుణామరేంద్రము
ఖ్యనిఖిలలోకపాలసమ♦తాంచితుఁడై సిరియొప్పుచుండఁగన్. ౩॥ 1808

తే. దశరథాహ్వయరాజనం♦దనుఁడు నగుచు
నలరురాముఁడు లక్ష్మణుం♦డను ననుజుని
దారయగుసీతనుం గూడి ♦ దండకావ
నమునకున్ వచ్చె; నాతని♦తరుణిమణిని. ౪॥ 1809

క. బలిమి జనస్థానంబున, ఖలుఁడగు రావణుఁడు దాను ♦ గైకొని చనియెన్
అలరామునకు సఖుండును, బలవంతుఁడు వానరౌఘ♦పతి రవిసుతుఁడున్.

తే. ఐన సుగ్రీవుఁ డిట్లు మ♦మ్ముందఱి నిట
మునిపతి యగస్త్యుఁడున్న ది♦క్కున యముండు
పాలనము చేయునదియునై ♦ పరఁగు నిచటి
కామె వెదకంగఁ బనిచె న♦య్యుదన సతఁడు. ౬॥ 1811

క. ఘోరాకారుల పంగడ, వీరాదుల వీరినెల్ల ♦ వీక్షించి తగన్
ధారణితనయను ఖలుఁడగు, నారావణుఁ గామరూపు ♦ నరయుం డనుచున్.

క. అనుపమరీతిగ మాకా,జ్ఞను జేసెన్; మేము నెల్ల♦శమను దిశను నె
మ్మనమునఁ గల శ్రద్ధ తగం, గనుఁగొంటిమి తిరిగి తిరిగి ♦ కాయము లలసెన్.
సీ. ఆఁకలిఁగొని భూరు♦హముఁగాంచి యద్దాని మూలముం జేరితి ♦ మోలినంత
మేమెల్ల వెలవెల ♦ మోములు వోవంగ ధ్యానపరాయణ♦త్వము వహించి
చింతార్ణవనిమగ్న♦చిత్తులమై దరిఁ గానకుంటిమి; నలుఁ♦గడల దృష్టి
సారించి చూడ గం♦భీరబిలంబొండు కనఁబడె లతలచే ♦ క్ష్మారుహముల
తే. చేతఁ గప్పఁగఁబడి పెను♦చీఁకటులను
గ్రమ్ముకొనియుండె నందుండి ♦ కమ్రసలిల
ములను దడిసినపక్షు లం♦చలును గోరు
వంకలును సారసంబులు ♦ వరుసమీఱె. ౧౧ 1814
క. జలముల నెల్లను బక్షుం, బులను విదుర్చుచును వేగ ♦ పోయెను; వానిం
గలయం గని చక్కనియో, బిలము ప్రవేశింత మనుచు ♦ వీరికి నేనే. ౧౨
క. హితముపదేశించితిఁ; బ,క్షితతుల్ జలసిక్తములయి ♦ చెచ్చెఱఁ జనుటెం
చి తగ జలముండు నిం దను,మతియుం గల్గినది నాకు ♦ మాన్యచరిత్రా!. ౧౩
తే. స్వామికార్యంబునందు ని♦శ్చలపుభక్తి
గలుగుటంజేసి త్వరగ నీ♦బిలముఁ జేర
వలయుననియును దోఁచెఁ ద♦ర్వాత మేము
నొండొరులచేతులూఁతఁగా ♦ నుక్కసుమున. ౧౪ 1817
క. తిమిరాచ్ఛాదితమగు వివ,రముఁ జొచ్చితి మంత సత్వ♦రముగా; నిది కా
ర్యము దీనిఁబట్టి చొచ్చితి, మమలాంగీ! యాబిలంబు ♦ నంతట నిచటన్. ౧౫
తే. ఆఁకటం జిక్కి సాధ్వి! నీ♦యందఁ జేరి
తిమి; యథావిధి నీవాతి♦థేయమును నొ
నర్చి యొసఁగిన ఫలముల ♦ నమలి మూల
ములను దిని యాఁకటం జిక్క ♦ కలరితి మిటు ౧౬ 1819
క. వనితా! యాఁకలిచే మృతిఁ, గననున్న మముల్ మహార్ద్ర♦కరుణన్ రక్షిం
చిననీకుం బ్రత్యుపకృతి, వనచరు లెద్దానిఁ జేయ♦వలయుం జెపుమా!. ౧౭
క. హనుమన్మూలంబుగ నా, వనచరు లీరీతిఁ జెప్ప ♦ వారిజదళలో
చన విని యాయూథపులం, గని పల్కెన్ వీరులైన♦కపుల న్నిమ్ముల్. ౧౮
చ. కనుఁగొనినంతనే మదివి♦కాసమునందెను ధర్మమౌ వ్రతం
బును దగనూని నేఁ దిరుగఁ♦బూనితిఁ గావున నేదిగాని కో
రను బ్రతిచేయ మీ కవస♦రంబిట లేదు మదీయగేహముం
గని ముదమొందుటే తగిన♦కార్యము దానని మోదమందితిన్. ౧౯ 1822

ఏఁబదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౫౩ - వ సర్గము.

-ఱఱ వానరుల స్వయంప్రభ తనగుహను వెడలించుట. ఱఱ-

క. అని తాపసి ధర్మాన్విత, మును శుభమును నైనవాక్య♦మును బల్కంగా
విని హనుమ యాస్వయంప్రభ, ననిందితవిచేష్టితను న♦యంబునఁ బలికెన్. ౧

సీ. ఓధర్మచారిణీ! ♦ యుద్యమ మలరంగ శరణుఁజొచ్చితిమి యీ♦తరుణమందు
మేమెల్ల నిన్నె, స్వా♦మియు మహితాత్ముఁడౌ సుగ్రీవుఁడెల్ల కీ♦శులకు నొసఁగి
నట్టికాలము గూడ ♦ నందఱ మిమ్మహాబిలమునఁ జరియించు♦వేళ దాఁటి
చనియెఁ గావున భయం♦బునుగల్గఁ జేయు నీగుహనుండి వెడలించి♦కుతుకమలరఁ

తే. గావఁదగు రాజొసంగిన♦గడువు దాఁటి
మరణదండనమునకు ని♦త్తరుణమందుఁ
బాత్రులముగా నెసంగి యీ♦భయమువలనఁ
జిక్కినట్టి మమ్ముం గావఁ ♦ జెల్లు నీకు. 1821

చ. జనకజ యున్నతావుఁ గనఁ♦జాలు మహోత్తరకార్య మిప్డు మే
మొనరుపఁగాఁ దగున్ వనచ♦రోత్తము నానతి దానిఁ జేయ మా
కు నిచట నుంట శక్యమయి ♦ కూడ నశక్యమె యయ్యె నిట్టు లో
యనఘమతీ! యటన్న విని ♦ యానవచారిణి యిట్లనెం దమిన్. ౫ 1825

క. దీనిఁ బ్రవేశించిన యే, వానికినేఁ బ్రాణములను ♦ బాయక వెడలం
గానౌనె కష్టమనియే, నేనెంచెద నట్టులయ్యు ♦ నిత్తరుణమునన్. ౬ 1826

క. చిరకాలనియమములచేఁ, గరమార్జించిన తపంబు♦కలిమిన్ మిము నె
ల్ల రయంబున వెడలించెద;, నరిగాఁ గన్నులను మూసి ♦ చలనరహితులై. ౭

*చ. వనచరులార! యుండఁదగు ♦ బాగుగఁ గన్నులు మూయుకున్నచోఁ
జనుట యసంభవంబగును ♦ సత్వరమే కనులెల్ల మూయుఁడం
చనియెను; వానరోత్తములు ♦ హర్షమునొందుచు దాఁటిపోవఁగాఁ
గనులను మూసికొంచుఁ ద్వర♦గా మృదులాంగుళిపల్లవంబులన్. ౮ 1828

క. కనుఁదమ్ములఁ గప్పుకొనన్, గనె నాతియు హస్తగుద్ధ♦కన్రుముఖుల న
వ్వనచరుల క్షణములోపలఁ, దనమహిమన్ వెలికిఁ జేర్చెఁ ♦ దదవసరమునన్.

సీ. ధర్మచారిణియైన ♦ తాపసి వారలనెల్ల నాశ్వాసించి ♦ యిట్లుపలికె;
వింధ్యాద్రియదె బహు♦వృక్షలతాకులంబగును సీమంతంబు♦నగును దాని
కవ్వలఁ బ్రస్రవ♦ణాద్రియయ్యది యిదె సగరవర్ధితమనఁ ♦ బొగడఁబడెడు
జలరాశి; వనచర♦సత్తములార! మీకెల్ల శుభంబగు ♦ నింక నేను

తే. గృహమునకుఁ బోవుదాన మీ♦రేగుఁడనుచుఁ
బలికి సిరులెల్ల వెలయు న♦బ్బిలముఁ జొచ్చె;

---

* తత స్సంమీలితా స్సర్వే సుకుమారాంగుళైః కరైః-అనిమూలము.

నంతఁ బెనుమ్రోతతోడ భ♦యంకరోర్మి
వితతి నిబిడ మపారంబు ♦ విషమమునయి. ౧౩ 1830

క. వరుణునకు నాలయంబై, పరఁగు సముద్రంబుఁ గనిరి ♦ పటుశక్తిమయా
సురుఁడును దుర్గమముగ ని,ర్భరమహిమం జేసినట్టి♦పర్వతగుహలోన్. ౧౪

క. వనచరులు వారు జనకుని, తనయాన్ వెదకంగఁ గిశ♦ధరణీపతిచే
సిన సమయమైనమాసము, చనియెను; దర్వాతఁ గిశ♦సత్తములెల్లన్. ౧౫

క. అనయము పుష్పితపాదప,వనములఁ దగు వింధ్యశైల♦పాదంబున మె
ల్లనఁ గూరుచుండి చింతిం,పనుసాగిరి; స్వీయకార్య♦పరిణతిఁ గనమిన్. ౧౬

చ. తరువులు పుష్పభారమును ♦ దాను భరింపఁగ లేకయుండ నుం
దరలతలెన్నొ వందలుగ ♦ ధాత్రిరుహంబుల నావరించి య
క్కరణి వసంతచిహ్నములఁ ♦ గ్రాలఁగఁ గాంచి కపీంద్రభీతి యె
వ్వరును దప్పదంచుఁ గపి♦వర్యులు చింతిలి రాకులాత్ములై. ౧౭ 1834

క. వనచరు లంత వసంతము, చనుదేనున్నదని శిశిర♦సమయం బిదియం
చనుచుఁ బరస్పరమును భీ,తిని బ్రశ్నించుచును జక్కఁ ♦ దెలిసికొని యటన్.

క. జనకజను గానకుంటయు, వనచరపతి యిడినగడువు ♦ త్వరగఁ జనుటయున్
గని పడిరి ధరణిపై భయ,మున శౌర్యములెల్లఁ బోవ ♦ బుద్ధులు గలఁగన్.

*క. కరివైరివృషస్కంధుం, డురుపీనభుజుండు వనచ♦రోత్తముఁడునునై
పరఁగి యువరాజు తారా,వరతనయుం డంగదుండు ♦ ప్రాజ్ఞుం డౌటన్. ౧౯

క. వనచరవృద్ధుల మిగిలిన, వనచరులన్ మధురతరసు♦వాక్కు లలర మె
ల్లనఁ బిల్చి గారవించుచు, ననియెం గృత్యంబు నెంచి ♦ యాదర మొప్పన్.

చ. హరివరులార! సూర్యసుతు♦నానతి నందఱ మిందు జానకిన్
ద్వరపడి యెల్ల తావులను ♦ దత్పరతం గన నచ్చినార, మా
తరుణి చెలంగు పెన్బిలము♦దావుననుండఁగ మాసమట్టె భీ
కరగతి దాఁటిపోయెను దఁ♦గన్ మదులం దది తోఁపలేదొకో?. ౨౧ 1839

సీ. ఆశ్వయుజంబను♦నట్టిమాసము మొదలందఱ మీమాస♦మంబుదనుకఁ
గాలంబు లెక్కిడి ♦ కార్యములకు నియమింపఁగాఁ బడితిమి ♦ తెంపుగల్గు
కపివర్యుఁ డనుపంగఁ ♦ గదలి వచ్చితి మిట నక్కాల మేగ జే♦యంగఁదగిన
పనియెద్ది? యింక; భూ♦పతికిని విశ్వాసపాత్రులై న్యాయమేక♦పథమెఱింగి

తే. స్వామిహిత మెప్డు గోరుచు ♦ సర్వకార్య
నిర్వహణచాతురిం దగి ♦ నేర్పుఱులయి
మీర లున్నారు; కార్యంబు ♦ మించకుండ
సఫలముగఁ జేయుపనిని మీ♦శక్తి యరిది. ౨౨ 1840

---

* సతు సింహవృషస్కంధః-అనిమూలము

క. వినుఁడీ! దిక్కుల విదితము;, వనచరపతి యాజ్ఞఁ జేసి ♦ వారిజనయనన్
జనకజ వెదకఁగ నన్నున్, మును నిడుకొని వచ్చితిరి ప్ర♦మోదంబలరన్. ౨౮

చ. చనియెను మాసముట్టి కొన♦సాగదు వచ్చినకార్యమింకఁ జా
వును గను టొక్కటే మనకుఁ ♦ బోలినకార్యము సందియంబు లే
దు నిజము సూర్యపుత్త్రుమదిఁ ♦ దోఁచినయర్థము చేయఁబూని యా
పనులను జేయకెవ్వఁ డిలఁ ♦ బ్రాణముఁ దాల్చి సుఖించు నెవ్విధిన్. ౨౯

క. హరిపతి తానె యొనర్చిన, గురుసమయము గడచిపోవఁ♦గూడదు గడువన్
హరులకు నెల్లరకును ని, ర్ధరణిం బ్రాయోపవేశ♦ధర్మము గొననౌ. ౨౬ 1843

ఆ. తీక్ష్ణమైనప్రకృతిఁ ♦ దేజరిల్లుచుఁ దానె, ప్రభువునైనవాఁడు ♦ పద్మమిత్ర
తనయుఁ డట్టులౌటఁ ♦ దా నిగ్రహము గడువు, దప్పి గొప్పదైన♦తప్పొనర్చి. ౨౬౪

క. మనమతని పరిసరమునకుఁ, జనినంతనె తగినశిక్ష ♦ సల్పఁగలఁడు తా
మనలన్ మన్నింపం డా,తనిగడువును మీఱితి మిట ♦ ధాత్రీతనయన్. ౨౭

క. కనుఁగొనఁజాలకపోతిమి, గనుకన్ క్షమియింప కతఁడు ♦ కాలునిరీతిన్
మనలం జంపెడుపాపం, బునకే యొడిగట్టు శాంతిఁ♦బూనఁడు సుండీ!. ౨౭౪

క. తనయులఁ బత్నుల నింట్లను, ధనములు దిగవిడిచి యిందె ♦ తగినవిధమునం
గనుదము వనచరులారా!, మనమిటు ప్రాయోపవేశ♦మహితవ్రతమున్. ౨౮౪

చ. మన మిటనుండి పోవ నను♦మానము లేకయె యంగదున్ వధిం
చును నిది నిశ్చయంబు; కపి♦నాయకుని చే మృతినొందుటేల? యీ
వనమున సద్వ్రతంబునని ♦ ప్రాణసమూహముఁ బాయుటొప్పగున్
నిను యువరాజుఁ జేసినను♦నీపై యతండు నిరున్ వధించునే. ౨౯౪ 1848

క. అనఁబోకుఁడు, కపిరాజ్యం, బునకున్ యువరాజు నన్నుఁ ♦ బొందుగ రవిజుం
డును పఁగలే దప్రియమే, జనునకుఁ గావింపనట్టి♦చతురుఁడు నృపుఁడున్.

తే. ఐనరాముఁడు నన్ను స♦మాదరమున
నప్పదము నందఁ జేసె; ము♦న్నర్కతనయుఁ
డీసుఁగనియుండుఁ గావున ♦ నెట్టితప్పు
దొరకినను దీక్ష్ణముగ నన్ను ♦ నరసి యరసి. ౩౦ 1850

క. అంతము నొందింపఁగలం, డంతటికఠినంపుశిక్ష ♦ నప్పురమున నా
వంతయు సందియమే లే, కంతము నే నొంద మిత్త్రు♦లందఱు వగతోన్. ౩౨

తే. నాయవస్థను గాంచి య♦న్యాయ మనుచుఁ
గుంద నాకేమిలాభమా? ♦ గోరి యిచటఁ
బావనాంభోధితటమునఁ ♦ బ్రాణములను
విడుచువాఁడను బ్రాయోప♦వేశ మూని. ౩౨౪ 1852

చ. అని యువరాజు వాలిసుతుఁ ♦ డాడిన వానరులెల్ల నొక్కరీ
తిని గరుణంబుగా ననిరి; ♦ తీక్ష్ణతరంబగు దుస్స్వభావముం
గను రవిసూనుఁ, డర్కకుల ♦ కాంతుఁడు రాముఁడు కాంతయందుఁ బ్రే
మను గనుఁబాఁడు గావున క్ష ♦ మానుతఁ గానక యెల్లవారముర్. ౩౪ 1853

క. తనచెంతకు రాఁ గని రాముఁనకుఁ బ్రియంబుగనె మునల ♦ ముందుగ వధియిం
చును సంశయంబు లేదిఁక, మన మగుగుటఁ దగదు కిశ ♦ మునసను దరికిన్. ౩౫

క. ఎవఁడపరాధ మొనర్చునొ, యవనీశునికడకు నాతఁ ♦ డరుగండగదో
యువరాజా! సీతాదేవి వెదకి యవ్వార్తనెల్ల ♦ విధములఁ దగఁగాన్. ౩౬

తే. ఎఱుఁగఁజాలితి మేని క ♦ పీశుఁడగుచు
వీరుఁడౌ సూర్యతనయుని ♦ వీటి కరుగు
దము, మహీసుతవార్తసుం ♦ తయును దెలియ
దేని యిచటనె యసువుల ♦ నెల్ల విడిచి ౩౭ 1856

క. అరుగుదము యమునియింటికిఁ, బరువడి నని; రట్లు చాల ♦ భయమున వ్యథలం
గర మనుభవించు నవ్వన,చరులాడిన పల్కులను విని ♦ సాధుతమీరన్. ౩౮

క. వారల కిట్లని చెప్పెను, దారుఁడు వగచుటయుఁ జాలుఁ ♦ వగ నామాటల్
మీరిష్టపడిన నీబిల, మేరీతిగనైనఁ జొచ్చి ♦ యుందుంప మిఁకన్. ౩౯ 1858

సీ. ఇది మాయచే రచి ♦ యింపఁగాఁ బడినదిగద, యట్లుగాన నె ♦ క్కరణినైనఁ
జొరఁగరా దెవరికిఁ ♦ దరువులు జలములు భోజ్యపదార్థముల్ ♦ పుణ్యపాన
సద్రవ్యములు చాలఁ ♦ గాఁ గల విందులోఁ గాన వాసార్హ మీ ♦ కందరంబు;
శక్రరాఘవకపి ♦ సత్తములవలని భయ మిసుమంతయుఁ ♦ బర్వదిచట;
తే. ననుచు నంగదుపల్కుల ♦ ననుమతించు
నట్లు తారుండు చెప్పిన ♦ యప్పలుకుల
వనచరుల్ విని కార్య మె ♦ ట్ఘంగిఁ జేయ
హింస గలుగదో యటుచేయుఁ ♦ డిప్పు డనిరి. ౩౯ 1859

ఏఁబదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౫౪ - వ సర్గము.

హనుమంతుఁ డంగదుని యభిప్రాయమును దూలనాడుట.

చ. హనుమయుఁ దారకాధిపని ♦ భాననుఁడై తగు తారుఁడిట్టు ల
వ్వనచరసంఘముం బలుక ♦ వాలిసుతుం డిఁకఁ గీశరాజ్యముం
గొనునని యెంచె; నయ్యనిలు ♦ కూర్మికుమారుఁడు వాలిపుత్త్రుఁడై
తనరెడు నంగదుంగని ని ♦ తాంతము బుద్ధిఁ దలంచె నివ్విధిన్. ౧ 1860

